# THE EMPIRE OF KOSALA

 OR 

## SRI RAMA, THE EMPEROR

B. V. SUBBA RAU, B.A., B.L.,
*Vakil.*
AUTHOR OF MANIHARAM
COCANADA.

# శ్రీరామచక్రవర్తి

Sri Ramachakravarthi

అనఁబడు

# కోసలసామ్రాజ్యము.

Kosala Samrajyamu.

(శ్రీరామచక్రవర్తిని గుఱించిన యాఱంకముల నాటకము.)

బులుసు - వేంకటసుబ్బారావు, బి. ఏ., బి. యల్.,

B Venkatasubba Rao



ఆనందముద్రణాలయము

లోఙ్ స్క్వేర్,

మదరాసు.

1932

వెల 0-12-0.] (సర్వస్వామ్యసంకలితము.) [మొదటి కూర్పు.

# కృతిసమర్పణము.

---

నా చేయివట్టు చందమున దవ్వులనుండి
యేనడపించు నదృష్టరేఖ, !
పావన రసరాగ భావమ్ములందెల్ల
నానందరూపనా నమరగీత, !
పారిజాతామల ప్రసవసందీప్తమై
యూహాపరంబులను జూపించు తార, !
యిదిరూప మిది హేయ మను భేద మెడలించి,
యున్నతానందమై యుల్లసిల్లు దేవి, !
చేకొనుము,—ప్రేమ జీవాభిషేచనంబు,
త్యాగభోగప్రఫుల్ల హృదంబుజంబు,
మహిత రాజయోగానంద మధురఫలము,
కావ్యలోక కళ్యాణమంగళము,—దీని! ॥

# విజ్ఞప్తి.

ఇదివరలో నే వ్రాసిన "మణిహారము" అనునవలనుజదివి సహృదయులగు పండితులు తమ యామోదమును నాకెఱిఁగించి కలిగించిన ప్రోత్సాహమే నేనీ నాటకముఁ బ్రచురించుటకుఁ గారణమయినది.

మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారికి నేను మిక్కిలి కృతజ్ఞుఁడను. వారు తెనిఁగించిన యుత్తర రామచరిత్ర నాటకమును మిక్కిలి శ్రద్ధగఁ బలుమారు చదివితిని. ఆ నాఁటి భవభూతియే వచ్చి నాచెంతఁ గూర్చుండి సంస్కృతభాషాజ్ఞానము చాలని నాకుఁ దెలియులాగునఁ దన నాటకమును వినిపించుచుండెనా యనిపించినది. ఆ యానందోత్సాహమున మనోహృదయములు వికసింప వస్తువు నా మూలాగ్రముగఁ దిలకించి, ధ్యానించి, ప్రస్తరించి భవభూతికిని, వేంకటరాయశాస్త్రిగారికిని నమస్కరించి సాహసించి యీ నాటకమును వ్రాసితిని.

ప్రథమాంకమున మూఁడురంగములలోఁ గాంబోలు నక్కడక్కడ (భవభూతి కథను నేననుసరించినంతవఱకు) గురువందన మాచరించి వేంకటరాయశాస్త్రిగారి యనువాదమునకు సాధ్యమగువఱకు ఛాయగ వ్రాసికొనుచుఁ బోతిని.

భవభూతియొక్క నాటకము తెనిఁగించుట నా యుద్దేశ్యము కాదు. అది నాబోఁటి వానిచేత నగునదియునుఁ గాదు. నా నాటకమును జూచి యీ మహాకవి యాత్మ కంటఁ దడివెట్టకుండుగాకయని మాత్రమె నా యాశయము.

అందెంతవఱకుఁ గృతకృత్యుఁడ నైతినో చెప్పఁజాలను. రసజ్ఞులగు పెద్దలు నాయందు దయయుంచి నా ప్రార్థన మన్నించి గుణదోషముల విమర్శించి నాకెఱిఁగించుచో నట్టి విమర్శనముల నెల్ల శిష్యభావముతో గ్రహించి యట్టి దోషములు ముందు లేకుండు లాగున సవరించుకొందునని మనవిచేయుచున్నాను.

కాకినాడ
8-6-32.

సుజనబుధ విధేయుఁడు,
బులుసు - వేంకటసుబ్బారావు.

మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర పండితపరిషదధ్యక్షులైన

శ్రీయుతులు

వేమవరపు రామదాసుపంతులుగారు వ్రాసిన




శ్రీబులుసు సుబ్బారావుగారు తమచే రచింపఁబడిన 'కోసల సామ్రాజ్యము' అను నాటకమున కుపోద్ఘాతమును వ్రాసి యద్దానిని పాఠకలోకమునకుఁ బరిచితముఁ జేయుమని నన్నుఁగోరి యున్నారు. కావ్యకళావిలాసైకలాలసులై యాంధ్రభాషామతల్లికి భక్తిపూర్వకముగఁ గావ్యరూపములయిన కానుకలర్పించు యువజనులగు కవికుమారుల మాతృభాషాపూజనమునఁ బౌరోహిత్యమును వహించుటకంటె నానందజనకమగు విషయము వేఱొండు లేదని వారికోరిక నంగీకరించితిని. అంతియగాక మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర పండితపరిషత్తుయొక్క యాధిపత్యమును జాలఁగాలము వహించియుండుట ననేకములగు ప్రాచీననవీనకావ్యరత్నములఁ బండితపరీక్షకులఁగలసి యొరసిచూచు చుండుటయు సంభవించుటఁ బట్టి యిక్కావ్యమును దక్కిన కావ్యములఁ బోల్చి చూచు

టయుఁ గల్గినది. ఈ కావ్యమందలిగుణమే నే నీ పని కంగీక రించుటకు ముఖ్యకారణ మయ్యెను.

ఈ కావ్యమునందలి కథ యుత్తరరామచరిత్రము. సర్వ శాస్త్ర విశారదుండయి కవిశేఖరులయందు మేటియనందగు భవభూతి కాలము మొదల లీనాటివఱ కెందఱో యీక్కథాన కంబును దృశ్య ప్రబంధంబుగ వెలయించిరి. భవభూతి గ్రంథము ననేకులు భాషాంతరీకరించిరి. రామకథా సుధారసంబును మహాకవి కృతకావ్యచషకంబునఁ గ్రోలు నిచ్ఛయే విబుధుల నీకార్యంబునకుఁ బురికొల్పియుండును. ఇప్పటికున్న యుత్తర రామచరిత్రపు దృశ్యప్రబంధములలో భవభూతి కృతం బుత్త మోత్తమంబనుటలో విప్రతిపత్తి లేదు. కాని యెట్టికథా రత్న మైనను సమర్థులగు కళావిదుల నిరంతర పరిశ్రమంబున సాన వెట్టఁబడి నూతనములగు ధారలఁ గలిగి ప్రకాశమానం బయి సారస్వతైకదృక్కుల హృదయంబుల వెలుంగఁ జేయును. అట్లే యుత్తమోత్తమంబయి మహాకవి విరచితంబైన యుత్తర రామచరిత్ర కథావిధానంబుగూడ నిప్పుడీ కవి కల్పనచే నీ గ్రంథంబున మెఱుఁగెక్కినది.

సీతా విషయకమగు నపవాదంబునకు హేతువు భవ భూతికృత గ్రంథంబున సుదృఢంబుగాదు. అద్దానికిఁ బ్రస్తుత గ్రంథమున సహేతుకంబగుస్థితి చక్కఁగఁ గల్పింపఁబడినది. విష్ణుశర్మ కౌమారుఁడగు బాలుని మృతికిని శంబూకుని శిక్షకును, సీతయపవాదంబునకును నేకీకరణంబగు నొక్క కల్పనమిందుఁ బొందుపఱుపఁబడియుండుట వస్తురచన మిక్కిలి

నై పుణ్యంబున నెఱవేర్పఁబడి యున్నదని చెప్పవచ్చును. భవభూతి గ్రంథమున రాముఁడశ్వమేధమును సంకల్పించుట కనివార్యంబగు నావశ్యకత గన్పించదు. ఇందలి శ్రీరామ చక్రవర్తి ప్రజారక్షణార్థ మశ్వమేధముచేయక తప్పదాయెను. అద్దాననిందుఁ దక్కిన కథయంతయు స్వాభావికమయి విషయమునుండి విషయము చక్కఁగ వెలువడుచున్నది. కుశలవుల యుద్ధమును నిరూపించు పట్లఁ గవి యనేకవిధముల భవభూతి కల్పనకు మెఱుఁగు వెట్టియున్నాఁడు. శంబూకుని వధకయి కవి కల్పించిన హేతువు సార్వజనీ నాంగీకారమును బడయఁగలదు. ఇంతయేల కథా శరీరమునందలి ప్రత్యవయవమును జక్కగా నొకదానితో నొకటి సంబంధించి సమమైన పుష్టినొసంగి రామణీయకము గొల్పుచున్నది.

పాత్ర పోషణమునందును గవి మిక్కిలి చక్కగఁ జమత్కరించియున్నాఁడు. ప్రాచీన రోమక సామ్రాజ్యమువంటి మహా విశాల సామ్రాజ్యమును బరిపాలించుచు సర్వ స్వతంత్రుఁడయ్యు ధర్మపాశ బద్ధుఁడై ప్రజారంజనమే దీక్షగాఁగల్గి కరుణా వీర్యములు రెండును మూర్తీభవించిన పురుషోత్తమ స్వరూపమే యిందలి శ్రీరాముఁడు. నిశ్చయముగ ధీరోదాత్తుఁడే. లవణ పాత్రయు శూర్పణఖా పాత్రమును దుర్జనుల తాత్కాలిక స్వార్థపర స్నేహము లెట్లు తుదిఁ దీఱని ద్వేషమున కాలవాలములగునో కవి చక్కఁగ నిరూపించి యున్నాఁడు. వీ రిరువురియందలి మనఃపరిణామమువలనఁ గవి ధర్మప్రధానమగు కరుణాసారము అతి లోకవ్యక్తినుండి వెల్వడి శత్రు జయము నాయుధముల జోక్యము లేకయే యెట్లు నిర్వహింపఁ గలదో నిరూపించి

యున్నాఁడు. వేయేల యిందలి రాముఁడు నిశ్చయముగ నాదర్శ ప్రాయుఁడగు సమ్రాట్టు.

శైలియు మృదుమధురమయి క్లిష్టకల్పనము లేక ధ్వన్యాదులకుఁ బాదయి పాఠకుల హృదయములకు మిక్కిలియు నానందదాయకమై యున్నది. పద్యములు లేని కొఱంత చదువరులకుఁ గన్పట్టదు.

ఇట్టి గ్రంథమును వ్రాసిన వీరి నభినందించుచు నిద్దానిఁ జదివి సహృదయు లానందింతురు గాక యని యింతటితో విరమించుచున్నాను.

మదరాసు,
29-11-32.

బుధవిధేయుఁడు,
వే. రామదాసుపంతులు.

# ప్రథమాంకము.

## మొదటిరంగము.

ప్రదేశము. వింధ్యపాదమందలి యొక గ్రామమున పంచాయితీ న్యాయస్థానము.

ప్రవేశము. పంచాయితీ దారులు, ఇందిర, విష్ణుశర్మ, కొందఱు గ్రామస్థులును. చితియొకటి మండుచుండును.

ఇందిర:—[మండుచున్న చితికి మున్మారులు ప్రదక్షిణముచేసి విష్ణుశర్మకును సూర్య భగవానునకును నమస్కరించి.]

ఓ పావనమూర్తీ! లోకాధారభూత! తేజస్స్వరూప! విష్ణుశర్మగారి నే పతిగా నమ్మియున్న దానననీ త్రికరణశుద్ధిగా సత్యము నేవచించుచు, ఓ దేవా! నన్ను నేన నీకుఁ బూర్ణాహుతిగ నొసంగి కొనుచుంటిని. ఎటుల నాదరించి ప్రోతువో లోకమెఱుంగుగాక! జీవ మరణములు రెండును నాకు సమానములె. రెండును. మిథ్యలె, ధర్మమే సత్యము. శాశ్వతము. అదియే లోకమున కిప్పుడు ప్రకటితమగుగాక!

[ అనుచు నిందిర మంటలో ప్రవేశించును. అందఱును హాహాకారముచేయుదురు. మంట లారిపోవును. ఇందిర యొప్పటివలెనుండును. కల్లోలము. కలకలము. ]

పంచాయితీ పెద్ద:—అమ్మా! ఇందిరా! నీవు పావనచరితవు. అజ్ఞానంబున నీకు శ్రమ కూర్చి నందులకు మన్నింప వేఁడుచున్నాము.

(విష్ణు శర్మనుద్దేశించుచు) నీవు మిక్కిలియు నదృష్టవంతుఁడవు; పుణ్యశాలివి. కావుననే యిట్టి మహాసతి నీకిల్లాలైనది. ఇదివఱకు లోకజనని సీతామహాలక్ష్మి యగ్నిఁజొచ్చి తనపాతివ్రత్య మహిమంబు ముల్లోకములకుఁ జాటియుండ లేదా! మనమానాఁడా మహాదృశ్యమును లంకలోనగుట, దర్శించు భాగ్యము లేక పోయినది. కాని యీ నాఁడట్టి మహిమయే మనకుఁ బ్రత్యక్షమైనది. కావున నోభూసురాగ్రణీ! నీమనంబున శంకల వీడుము. నీ భార్య పవిత్రురాలు. ఆశంబూకునియెడ దోసమెంచకుము.

[హర్షధ్వనులు- తెరపడును.]

---

రెండవ రంగము.

ప్రదేశము. ఆ గ్రామమందె యొకవీధి-భద్రుఁడు, భీముఁడు ప్రవేశింతురు.

భద్రు:—ఎన్నఁడుఁ గని విని యెఱుఁగని మాట! అకాల మరణమా? అపసవ్య మరణమా? పురిటింటిలోని శిశువు మరణించెనా? ఏమి! ఇది శ్రీరామ రాజ్యమున కేదో గొప్ప దుశ్శకునమె! ఉల్కా పాతము వంటిది.

భీ:—పాప మా విష్ణుశర్మ చచ్చిన బిడ్డను భుజమున వైచికొని యయోధ్యకుఁ బోవుచుండెను.

భద్రు:—ఎందులకు ?

భీ:—శిశుకళేబరమును జక్రవర్తి పాదపీఠము కడఁ బడవైచి యేమొ మొఱపెట్టుకొనునట !

భద్రు:—అయ్యయో ! వానికి నిజముగఁ బిచ్చియెత్తినదే !

భీ:—ఎవ రెన్నివిధములఁ జెప్పినను మానక పోవుచున్నాఁడు.

భద్రు:—జీవ మొక్క లేశమైన నున్నయెడల రాజు వైద్యులచే మందు మాకు లిప్పించి బ్రతికించును గాని లేనిచోఁ జక్రవర్తి... ... ....

భీ:—మందు మాకులా ! - మొదట, సంతానము కొఱకని భార్యకు మందు లిప్పించియేకదా ఇంత తెచ్చుకొనెను !

భద్రు:—అన్నా ! అదేమి ? - ఎవరిచే మందిప్పించెను?

భీ:—ఎఱుఁగుదువు గదా ! యీదండక వనము చెంగటనే శంబూకుఁడను యోగి యొకఁడున్నాఁడు.

భద్రు:—అతని నెఱుఁగనివారీ ప్రాంతమునఁగలరా ? అతఁడన్నము తినఁడఁట-బంగారము చేయునఁట-దూరదృష్టి-దూరశ్రవణము - ఆకాశగమనము - పరకాయ ప్రవేశము - వెయ్యేల ? అతఁడు కురియుమన్న వాన కురియవలె ! మండు మనిన నిప్పు మండవలె! మాను మనిన మానవలె!-జీవమారణ యంత్రము లెన్నియో కనిపెట్టినఁట. "నేన యీ ప్రకృతి కధినాథుఁడ ! నా కంటె నీభూతశ్రేణికి రాజు వేఱొకఁడు లేఁడు" అని పలుకుచుండు నఁట-వాని నెఱుఁగని వారుందురా ?

భీ:—పాపము! వాఁడెన్ని జీవులనైన క్షణములోఁ జంపఁ గలుగునుగాని యొక్కబొందిలో తిరిగి ప్రాణము పోయు

నూతన్నము తెలియఁడాయె. అది యొక్కటియె లోటు. దానికొఱకె వేయి విధములఁ దలక్రిందుగఁ దపము చేయుచున్నాఁడఁట.

భద్రు:—అది తెలిసినయెడ దేవుఁడే. పాపమాతఁడు బ్రాహ్మణ బాల శవము నయోధ్యకు మోసికొని పో నక్కఱయే లేక పోవును.

భీ:—ఇదిగో! ఆయోగిపుంగవుని శిష్యులు వచ్చు చున్నారు.

(ఇద్దరు శిష్యులు ప్రవేశింతురు.)

భద్రు:—అహో! మీగురు బ్రహ్మము కుశలమా ?

1. శి:—ఏమిచెప్పుదుము ! పాపమాయిందిరబిడ్డ పురిటింటి లోనె జారిపోయెనని వినినప్పటినుండియు వారి చింత యినుమడించినది.

భీ:—కన్న తండ్రికి - మందిచ్చిన వైద్యునకు, ఫలము విఫల మైనచో నట్టి చింత సహజమె గద !

2. శి:—మందులన్న మందులా!- రేయనక పవలనక యామె గర్భకోశములో నేకధారగఁ గురిపించి నారు.

1. శి:—నాఁడు, అగ్ని పరీక్షయిచ్చునాఁడు తెప్పించిన ఆయా కులు-తీయించిన పసరులు లెక్క లేదు. మారెక్కలు ముక్కలై చేతులు పడి పోయినవి.

2. శి:—కోయునప్పుడు విరిగిన ముల్లిదిగో, సెలవేసి యింక నిప్పటికిని బాధించుచున్నది.

భీ:—నాఁటికి వైద్యము పూర్తియై - మూఁడవమాసము కా వచ్చినదే.

భీ:—అప్పుడు తిరిగి పసరు లెందులకు ?

1. శి.—మాకేమి తెలియును ? - పసరు తీయించి వారె స్వయముగ నామె కాపాదమస్తకమును మంత్ర పుర స్సరముగఁ బూసియుండిరి.

2. శి:—ఆ పసరు మహిమ యదేమియోగాని మూఁడు నాళ్ల వఱకు మాయరచేతులకు స్పర్శజ్ఞానమే లేదు. నీటముం చిన చలువ తెలియదు. నిప్పు సోకిన సెగ తెలియదు. ఆనాటిరాత్రి తామ్రపుటము తీయవలసి వచ్చినది. చెంత నుపకరణము లందుపాటులో లేక పోయినవి. కానిమ్ము చూతమని తామ్రమనుకొని తటుకున కణ కణలాడుచున్న నిప్పును తీసి యీవలఁబెట్టితిని. అదేమి చిత్రమోకాని చేతికి వేడి తెలియదు. బొబ్బలేవదు. మీదు మిక్కిలి ఆనిప్పారిపోయినది.

భద్రు:—అగును, దేనియందేమి మహిమలున్నవో మన కేమి తెలియును ?

భీ:—ఇప్పుడు వచ్చిన కారణము.

1. శి:—ఆయన బిడ్డ నయోధ్యకుఁ గొనిపోవునని విని కొని పోయెనో లేదో చూచి రమ్మనిపంపిరి. ఉన్నచో - శిశువును పునర్జీవితునిఁ జేయు సాధనముల నరయవచ్చు నని చెప్పి తల్లిని బిడ్డను దమయొద్దకుఁ దీసికొనిరమ్మనిరి.

భీ:—అయోధ్యకు వెళ్లిపోయిరని చెప్పుఁడు.

శిష్యులు:—మంచిది (అని శిష్యులు నిష్క్రమింతురు).

భీ:—అన్నా ! చూచితివా ?

భద్రు:—బాగుగనే యున్నది. శ్రీరామరాజ్యమందేనా-యిట్టి ఘోరపాపములు.

భీ:—ఏమని చెప్పుదును ? - నీకు ప్రత్యక్షముగఁ దెలియుటకని నేనడిగితినిగాని యిది యందఱెఱిఁగినపరమరహస్యమే:- లోకమును మాయా మూకుడున్నదా ? - న్యాయ స్థానములు ! - ధర్మములు ! - అగ్నిపరీక్షలు! అన్నియు నింతలోని వెగద ! ఏవో నాలుగు క్షుద్రమంత్రముల నేర్చిన శూద్రుఁడు ! వీనికే యింత ప్రజ్ఞకుదురఁగ - బ్రాహ్మణుఁడు, మహోపాసకుఁడు, సర్వలోకముల జయించినవాఁడు, రావణున కెంత లేసి ప్రజ్ఞలుండి యుండునో !

భద్రు:—(చెవులు మూసికొని) హర! హర!-పాపము శాంతిం చుగాక ! ఏమి విపరీతకాలము వచ్చినది ! సర్వలోక జనని, భూపుత్త్రి జానకి, శ్రీరాముని సతి - సీత - ఆ పట్టపుదేవినిగూర్చి. అన్నా ! యిటులఁ దలఁపఁ దగునె ?

భీ:—నే దలఁచుట లేదు - ఇందిరా శంబూకుల వృత్తాంతమును గన్నులారఁగాంచి, విని, లోకమటుల తర్కించి సంకో చించు చున్నది. అది సహేతుకమా? నిర్హేతుకమా?- ధర్మమా ? - అను విషయము నే నిర్ణయింపఁజాల. మనము నిర్ణయించియు లాభము లేదు.

భద్రు:—కట్టా ! లోకాభిప్రాయమెంత చంచలము! - లాఘ వము! - అది యొక వెల్లమబ్బువంటిది. దాని రూప గతులకు స్థిరత లేదు. ఒక్కధర్మము లేదుగదా ! -

హా!—తండ్రీ! రామచంద్ర! - తల్లి, సీతమ్మ! ఏదండ కాటవియందు పతి మేనిచ్ఛాయవలె సంచరించి పాతివ్రత్యోత్కృష్టతను లోకమున కెఱింగించితివో, ఆదండకాటవి మొగాళంబున నే; ఏమి దుర్యోగము చేత నమ్మా? ప్రజలిట్టి తలంపరాని తలపులం దలంచి తమ్ము తామె నిర్భాగ్యులుగం గలుషవంతులునుగం జేసికొనుచుండిరి !

(తె ర ప డు ను).

---

# మొ ద టి యం క ము.

## మూఁడవ రంగము.

శ్రీ:—దేవీ! ఊఱడిల్లుము. భేలపడకుము. మనలను విడిచి చనుటకు వారి కోరికయూ కారణము. వైదిక కర్మ నిష్ఠా పరతంత్రులుగదా.

సీ:—ఎఱుఁగుదును. నాథా! కాని బంధులు, ఆత్మబంధులు చెంతనుండి యరుగుచుండ ఆస్నేహపాశము బిగిసి పోయి యనివార్యమగు హృదయ సంతాపముఁ గలిగించుచుండెను.

శ్రీ:—ఈ సంసారభోగములు - కావుననే క్షణికములు. నవ రసములు రూపటి కలసి యింకిపోవ హృదయ పాత్రి కను దహియించుటకే యీ సౌఖ్యములు అని తెలిసి

కొనియే తత్త్వజ్ఞులీతాత్కాలిక సౌఖ్యములకురోసి తపోవనముల నాశ్రయింతురు.

వృద్ధకంచుకి ప్రవేశము.

కం:—రామభద్రా! (ఆగి తెల్లబోయి) మహారాజ!

శ్రీ:—(చిఱునగవుతో) తండ్రిగారి నాఁటివాఁడవు. నేఁడు నీయలవాటు నేల మానుకొనవలయును. మీబోంట్లు మును పటిచొప్పునఁ బిలుచుటయే బాగుండును.

కం:—దేవా! అష్టావక్రమహాముని తమ దర్శనార్థమై ద్వారము కడ వేచియున్నారు. ఋష్యశృంగాశ్రమము నుండి వచ్చితిమని సెలవిచ్చుచున్నారు (రాముఁడు సీతదిక్కు చూచును).

సీ:—ఆలస్య మేల ?

శ్రీ:—సగౌరవముగ ప్రవేశపెట్టుము. (కంచుకి వెడలిపోవును. అష్టావక్రుఁడు వచ్చును).

శ్రీ:—(నమస్కరించి) ఇటు విచ్చేయుఁడు.

సీ:—(నమస్కరించి) కుశలమా! మా అత్తలకును, శాంతలకును కుశలమా ?

శ్రీ:—మా బావయాగము నిర్విఘ్నముగ సాగుచున్నదా ?

సీ:—మమ్ముల నెన్నఁడైనఁ దలఁతురా ?

అ:—అటుల నడుగవలయునా తల్లీ! గురువులగు వసిష్ఠులవారు మీకిటుల చెప్పుమని సెలవిచ్చిరి. నిన్ను గనిన తల్లి రత్నగర్భయాయెను - ఆకర్మయోగి నిన్ను పెనిచిన జనకుఁడాయెను. పరమ పావనుఁడాదిత్యుఁడును, మేమును

కులగురువులమగు రఘువంశమువారికి నీవు కోడల
వైతివి. అటువైని నిన్నేమని యాశీర్వదింపవలయును?
జగదేక వీరులగు పుత్త్రులనుగనుము.

శ్రీ:— మహా ప్రసాదము! దేవీ మనకిది వరప్రసాదము.

అ:—అరుంధతీ దేవియును, మీూతల్లులును, సోదరి శాంతయుఁ
గూడ - రామచంద్రా! సీతతో ప్రత్యేకము చెప్పు
మనిరి. సీత యే కోరిక కోరినను వెంటనే తీర్చు
చుండుమని.

శ్రీ:—(గూఢ మందహాసముతో) నాతో చెప్పెనుగదా!

అ:—అమ్మా! పూర్ణగర్భవు గాన నీ యాగమునకుఁ
దోడ్కొనపోవ వీలైనదికాదు. కావుననే నీకొఱకు
శ్రీరామునిగూడ నీయొద్దనే యుంచి వచ్చితిని. కాని
యచిరకాలముననే పుత్త్ర పూర్ణోత్సంగవగు నిన్నుఁ
గాంచెదము," అని ఋష్యశృంగులు చెప్పుమనిరి.

శ్రీ:—మిక్కిలి యానందము. లోకములో జనులవాక్యము
లర్థమును వెదకికొనుచుపోయి చేర ప్రయత్నించును.
కాని వాక్శుద్ధిగల మహర్షులపట్ల తదర్థములే తమంత
వచ్చి వారుచ్చరించిన వాక్యములను చేరుచుండును -
మా గురువులగు వసిష్ఠులును నాకేమియు నాజ్ఞాపింప
లేదా?

అ:—నీవు తరుణవయస్కుఁడవు. నూతన పట్టాభిషిక్తుఁడవు.
రాజ్యమా! విశాలమైనది. ప్రజారంజనము, యశో
పార్జనము మాత్రమే సుమా రాఘవుల సంపద. ఆ
మర్యాదల నెఱింగి ప్రజల పాలించుచుండుము. అల్లుని

యజ్ఞమున చిక్కుపడియుంటిని. త్వరలో నేవచ్చి నిన్ను కలిసికొనఁగలను. అని మా రామచంద్రునితో మఱి వక చెప్పుమాయని నాకాజ్ఞాపించియే యుండిరి.

శ్రీ:—భగవానుల యాదేశానుసారముగనే ప్రయత్నింతును. ప్రజారంజనమేనాకు విధి. ప్రజలను రంజించుటకై నా ధనమునుగాని, సుఖమునుగాని, ప్రాణమునుగాని వేయేల నా ప్రాణేశ్వరిని జానకినిగాని త్యజింపవలసి యున్నను నా మనస్సునకు ఖేదము కలుగఁజాలదు.

సీః—కనుకనే ఆర్యపుత్రుఁడు రఘువంశధురంధరుఁడు. ఆ బిరుదము సార్థకమైనది.

శ్రీ:—కంచుకి! వీరికి సవినయముగ త్రోవఁజూపుచు విశ్రామ మందిరము కనపఱచుము.

(కంచుకి ప్రవేశము).

ల:—అదిగో మీా సోదరుఁడు లక్ష్మణుఁడు వచ్చుచున్నాఁడు.

(కంచుకి - అష్టావక్రుఁడు - వెళ్లఁబోవుదురు. లక్ష్మణుఁడు ప్రవేశించును).

ల:—ఆ చిత్రకారుఁడు అర్జునుఁడు మిక్కిలి నేర్పుతో చాల వఱకుఁ దన కథ చిత్రించియున్నాఁడు.

శ్రీ:—నీ వదినెను వినోదపఱచు నుపాయము బాగుగా నెఱుంగుదువు. ఎంతవఱకైనది ?

ల:—అగ్నిశుద్ధివఱకు.

శ్రీ:—హా సీత! పుట్టుకచేతనే పవిత్రురాలవగు నీకన్యపదార్థ ములవిశుద్ధియేల? అగ్నిహోత్రమును బుణ్యతీర్థమును, బావన మొనరించు పదార్థముగలదా! కాని నీ యపయశము నీ కామరణము నిలిచిపోయెంగదా!

సీ:—ఆర్యపుత్త్రుని చారిత్రమును చూతము. (మువ్వురును ముందునకు వత్తురు. తెఱదిగును. వరుసగా చిత్రములు గోడపై (వ్రాయఁబడియుండుట గనఁబడును.)

సీ:—గంభీరాకృతులుదాల్చి, యించుక భీతావహములై కానవచ్చెడి - ఈ మూర్తులేమి?

ల:—అవియే జృంభకాస్త్రములు. దేవతలెల్ల నిజాంశములఁ జేర్చి యీరూపంబగు నస్త్రంబుల నిర్ణయించిరి.

సీ:—ఆర్యపుత్త్రుని స్తోత్రము చేయుచున్నటులున్నవి!

ల:—అగును. అప్పుడు విశ్వామిత్రుని వలన నన్నయ్య వశము గావింపఁబడినవి.

శ్రీ:—దేవి! ఆయస్త్రరాజములకు నమస్కరింపుము.

(సీత నమస్కరించును.)

శ్రీ:—అవితప్పక నీగర్భమందలి శిశువును జేరి సేవింపఁగలవు.

సీ:—మహాప్రసాదము.

ల:—ఇదిగో మిథిల-

సీ:—త్రిజగన్మోహనమగు నీయిందీవరదళశ్యామ దివ్యసుందర మంగళ విగ్రహమును నాతండ్రికూడ - ఎటులనక్కజపడి చూచుచుండెను! రెప్పవాల్చుట లేదు.

శ్రీ:—జనకులకును రాఘవులకును వియ్యము మిక్కిలి. శోభస్కరమై యొప్పుచుండును.

సీ:—సోదరులు నలుగురు మధు పర్కములధరించి కంకణ
ములఁ గట్టికొని యుండిరి. ఆసమయమున ఆ తావున
నున్నటుల నేయున్నది.

శ్రీ:—నిజము. ఆనంద వీచికల నన్నోలలాడించిన పాణిగ్రహణ
మహోత్సవ సమయంబదియే యను నట్లున్నది.

(సీత కరము పట్టును.)

ల:—ఇదిగో ఈమెవదినె - చిన్నవదినె మాండవి - మరదలు
శ్రుతకీర్తి.

సీ:—మఱి యీామె యెవతె? మధ్యనున్నది?

ల:—(స్వగతము) ఊర్మిళను చెప్పలేదని (ప్రకాశముగ)
యిది చూడఁదగినది.

ఈయన పరశురామమూర్తి.

సీ:—(భయము ప్రదర్శించును)

శ్రీ:—భగవానునికి నమస్కారము.

ల:—భయమేల వదినె? చూడు మిదిగో ధనుస్సు.

శ్రీ:—ఇంకను ముందు చాల చిత్రములున్నవి.

సీ:—ఈవినయ మార్య పుత్త్రుని సహజ భూషణము.

ల:—ఇది యయోధ్య!

శ్రీ:—ఆహా! గతించెనుగదా - ఆదినములు నాయనగారుం
డఁగా - వివాహములైన వెంటనే ప్రియులతో మిథిల
నుండి వచ్చిన యాత్రొత్త దినములలో,తల్లులు మనలను
మిక్కిలి మక్కువతో చూచుచు వలసినవెల్ల మనము
కోరకయే మున్నె సమకూర్చుచుండెడు ఆ కాలము -

ఆసుఖము - గతించెనుగదా ! ఆదినము లేఁకరావు గదా సోదరా ?

ల:—ఇదిగో మంథర.

శ్రీ:—దేవీ ! ఈగార తరువు జ్ఞాపకమున్నదా! శృంగిబేరమున దీని క్రింద నేగదా గుహుని సఖ్యము మనకుఁ గలిగినది.

ల:—కైకమ్మ గాథ యెల్లవిడిచి పెట్టఁబడినది.

సీ:—ఇచ్చటనే నారబట్టలఁదాల్చుట.

ల:—రాజ్యము పుత్త్రునకు పట్టముగట్టి యిక్ష్వాకు లింతదను కవార్థకమున దాల్చిన జటల నన్నగారు నేఁడు లేప్రా యమందు దాల్చి కఠోరమగు వనవాస దీక్షఁబూనిరి.

సీ:—ఇదిగో మాయమ్మ భాగీరథి !

శ్రీ:—మాకులదేవతకు నమస్కారము.

ల:—ఇది భరద్వాజులు చూపిన శ్యామమను మఱ్ఱిచెట్టు.

సీ:—ఆర్యపుత్త్ర! యీప్రదేశమును మఱచితిరా?

శ్రీ:—సీతను రాముఁడెన్నఁడైన మఱవ గల్గినయెడల.

సీ:—ఆహా ! భూలోకమును తరింపఁజేయ నవతరించిన యీ భాగీరథి - తపోవనములు.

బ్రహ్మసాక్షాత్కారము వడసిన మునీశ్వరులు - మునిప త్నులు - వారి పెంపుడులేళ్లు - పూలమొక్కలు - చిగురు టాకునగలు - నివ్వెరధాన్యంపు టోగిరములు - ఆనిశ్చలత - నిర్మలత - పవిత్రత - ఆనందము - ఆహా - ఈనగరములలో - రాజమందిరములలో - షడ్రసోపేత పంచభక్ష్య పరమాన్న ములు - ఈమానవ నిర్మితో ద్యానములు - కన్నులు మిఱు మిట్లు గొలుపు నీమాణిక్య కాంతులు-చలువరాతి తిన్నలు -

రెంటికి నెంత వ్యత్యాసమున్నది - తిరిగి యొక్కసారి పోయి యా శోభననుభవించి రావలెనని కోరిక పొడము చున్నది.

శ్రీ:—తమ్ముఁడా ! కుదుపులేని పూలతేరి నొక దాని నాయత్త పఱపుము.

సీ:—(రాముని హస్తముపట్టుకొని) మొగము చూచుచు - యించుక ఆగి) నీవును రావలయును సుమా !

శ్రీ:—ఎంతకఠిన హృదయము. అటుల వేఱ తెలుపవలయునని యే తలఁచితివికదా !

లక్ష్మణా! తిరిగి యొకసారి వన విహారమునకు పోయివత్తము.

ల:—మంచిది అటులనే - రథము సిద్ధము చేయించెదను.

(లక్ష్మణుఁడు వెడలి పోవును.)

శ్రీ:—ప్రేయసీ! యిటురమ్మా. ఈకిటికీ క్రిందఁ గూర్చుండుము. సరయు విదిగోచూడు మెంత ప్రశాంతముగ నున్నదో.

సీ:—నాథా ! నిదుర నన్నావహించుచున్నది.

శ్రీ:—అటులైనరమ్మా. నీబాహులత నాకంఠమున గీలించి రమ్మా.[అటచేయి చుట్టుకొని.]ఏమిది సుఖసాగరమా? దుఃఖ తరంగమా ! మెలకువగలిగి తేలుచుంటినా ? నిద్రలో మునుఁగుచుంటినా ? విషము వ్యాపించు చున్నదా? అమృతము ఉత్కంఠితము? ఉక్కిరిబిక్కిరి యగుచున్నదా? యీస్పర్శ మాత్రంబుననే యింద్రియ విమోహితుఁడ నగుచుంటిని.

సీ:—తమ యనురాగము స్థిరము. అంతకంటె వేఱేమున్నది.

శ్రీ:—హృదయేశ్వరీ ! నీమాటలు మోడువడిన జీవిని చిగురింపఁజేయును. ప్రేమ తృష్ణాపీడితుని సంతృప్తుని గావిం

చును. శ్రవణామృతంబులై హృదయోత్తేజకములగు చుండును.

సీ:—ఆర్యపుత్రా ! చక్కని మాట నేర్పరివి. పరుండెదను.

(అని నలువంకలఁగలయఁ జూచును.)

శ్రీ:—ఏమి కావలయును? పెండ్లినాటినుండియు నగరమందును నరణ్యమందును ; సుఖమందును దుఃఖమందును ; సదా నీకే యర్పితంబును. అన్యచే ననుపాశ్రితంబును నగు రాముని భుజమిదిగో. ఏల వెదకెదవు కైకొనుము. ఏల వేఱ తలగడలు నీకు.

(సీత అటులనే అనుకొని నిద్రించును.)

శ్రీ:—ఈసఖ ! యెంతలో నిదుర చెందినది. నాగృహలక్ష్మి - గేహదీపిక - నేత్ర పర్వమీారూపము. చందనద్రవమీా స్పర్శ, మౌక్తికసరళి యీాం బాహువల్లిక - యీాసఖ యెందు ప్రియహేతువుగాదు. ఒక్క వియోగమందు దక్క - అచింత్యము; ఆసంభవమగు నీమాట యేల రావలయు నానోట ? సుఖపుంజమందును గష్ట రేఖ యే మూలనో కంటకమువలె నంటియుండును గాబోలు !

(సీతాంతికి పురపరిచారికా వేషమున శూర్పణఖ చిత్రపట మును దాచి తెచ్చుట నభినయించుచు ప్రవేశించును.)

శ్రీ:—మాలినీ ! ఏమి యటుల దాచుచుంటివి ?

సీ:—(నిద్రలో)హా! ఆర్యపుత్ర! ఎటనున్నావు? ఎటనున్నావు?

శ్రీ:—అర్ధాంగి కలువరించుచున్నది - చిత్ర సందర్శనంబునఁ బూర్వగాథస్మృతిపటమునకు వచ్చి యుండనోపు.

శూ:—ఏమున్నది - చిత్రము.

శ్రీ:—ఏమిచిత్రము? - చూపుము.

శూ:—నూతనముగ నభ్యసించు కళ గావున దేవి యెవ్వరికిని చూప వలదన్నది.

శ్రీ:—పోనిమ్ము - పేరేమి?

శూ:—గ్రుచ్చియడుగనేల? రా - వణ - పటము.
—రావణుఁడా! రాక్షసుఁడా!

(నేపథ్యమున - "అబ్రహ్మణ్యం! అబ్రహ్మణ్యం! రామ చంద్రప్రభూ! అబ్రహ్మణ్యం"-అని ఘోష-శ్రీరాముఁడు విని తటాలున వెడలి పోవును.)

శూ:—భళి! భళి! అటశంబూకుని కుపదేశించిన మంత్ర తంత్రములు - ఇటరావణ చిత్రపట ప్రసంగము దివ్య తమముగ మేళవించినవి. నాకార్యమనుకూలించును. సీతా! నీవు మిక్కిలి చక్కని చుక్కవఁట! నీ కున్న చక్కదనము నాకు లేక పోవచ్చును, అయిననేమి? పూర్ణచంద్రు ననుభవించుట కేవల సురూపల హక్కు మాత్రమె కానేరదు. కురూపలకా హక్కు లేక పోలేదు. నేనును రామచంద్రునిఁ బ్రేమించుచుంటిని. నీవు లేక పోయిననేమి? నేనాస్థానము నాక్రమించి నా రామచంద్రునకెట్టి కొఱంతయుఁ గలుగనీయను. పొమ్ము! అడవులపాలై పొమ్ము! విధికాదు - శూర్ప ణఖయాజ్ఞయైనది! పొమ్ము! శ్రీరాముని నాకు విడిచి నీ వడవుల పాలై పొమ్ము! నీ మూలమున నాఁడు నాకు ముక్కును చెవులును పోలేదా! - మాలంక

ధ్వంసము కాలేదా ! - నీయెడ నాకుఁ గరుణలేదు. పొమ్మ్మ ! అడవులపాలై పొమ్మ్మ ! నేను రాముని చెట్ట పట్టి సుఖింపవలయు ! అయోధ్యకు రాణినై యేల వలయు ! - నాజీవితము ధన్యమగుకాలము, ఇదిగో దాపునకు వచ్చియున్నది !
(సీతయింకను నిద్రించుచున్నది. తెరపడును.)

---

## నా లు గ వ ర ం గ ము.

శ్రీరాముని దర్బారు—(సభయెల్లనిండి యుండును. విష్ణుశర్మ శిశు కళేబరమును జక్రవర్తి పాదపీఠముకడఁ బడవేయును. అందఱును విభ్రాంతులై చూచుచుందురు.)

శ్రీ:—ఏమిది? విప్రోత్తమా !

వి:—ఏమియును లేదు రాజోత్తమా ! శిశుకళేబరము అపసవ్యమృత్యు ప్రదర్శనము ! దేవరధర్మ పరిపాలన ఫలము !

సుమంతుఁడు<br>సైన్యాధ్యక్షుఁడు } :—ఏమను చుంటిరి ?

వి:—హా ! పుత్త్రకా ! ఆదశరథ మహారాజు గతించిన వెనుక నింకను ; ఈపాపిష్ఠ పరిపాలన మందుండుటచేత గదా తండ్రీ ! నీకీ యకాల మరణమును, నాకీ పుత్త్రశోకమును, గలుగుట ! ఇక్ష్వాకుల పరిపాలన మందలి సౌఖ్యము ప్రజలకా దశరథునితోడనే చెల్లినది. ఇదియా రాఘవరాజ్యము ? రాక్షసరాజ్యము !

భర:—(చెవులు మూసికొని) శ్రీహరీ !

ల:—ఆర్యవర్య ! శ్రీరామచంద్రుని రాజసభా మంటపమున నిలిచియుంటివి. ఔచిత్యమెఱిఁగి మాటలాడవలదా ?

సు:—రాజనిందయా ? విప్రోత్తముఁడవు.

సై. అ:—సుమంతా ! కావుననె యింకను సజీవుఁడు !

(శ్రీరాముఁడు లేచిచేయెత్తి వారించి)

శ్రీ:—భావ్యముకాదు. రాజధర్మముకాదు. నారాజ్యమందలి ప్రతిజీవియు నిరంతర సౌఖ్య మనుభవించుటకు హక్కు గలిగియున్నది. అద్దాని కెట్టి భంగము వాటిల్లినను రాఘవ కిరీటముఁ దలఁదాల్చిన యీ రాముఁడే బాధ్యుఁడు.

(విష్ణుశర్మను సమీపించి)

భూసురాగ్రణీ ! క్షమింపుము, వేఁడుచుంటిని. పుత్త్రశోకము తల్లి తండ్రులకు మాటలవలనను పశమిల్లెడిది కాదు. పుత్త్ర వియోగమెకదా మజ్జనకుని ప్రాణముల హరించినది. అపసవ్యమైన యీ యకాల మరణమునకుఁ గారణము—నేబుద్ధిపూర్వకముగ నొనరించిన దోషము కానరాదు - ధర్మపాలనమునం దెద్దియేని ప్రమాదము - అజ్ఞానకృతము వాటిల్లి యుండవలయు. ఖగోళమున నసంఖ్యాకములగు గ్రహనక్షత్రకోటులు, నిరంతరము మహా వేగమున సంచరించుచు, నిజధర్మ బద్ధమై యుండుటచేతనే నిరపాయముగ సురక్షితముగ విలసిల్లుచున్నవి. అందొక చిన్న నక్షత్రము కట్టుతప్పి యీవలకించుక వచ్చెనేని సర్వనాశము మహా ప్రళయము సంభవించును. భూగోళమందలి యీ జీవకోటియునట్టిదే. ఏ వ్యక్తి నిజధర్మమతిక్రమించినందున విలయమిటుల సూచింపఁబడుచున్నదో కనుఁగొన

వలయు. అద్దానిఁ జక్కఁజేసిన నీశిశువు పునర్జీవితుఁడై తీరును. కావున నించుక సైరించి యొక్కింత యవకాశమిచ్చిన, భూదేవోత్తమ! ఈ రాముఁడు తన పరిపాలనయందు సంక్రమించిన దోషములఁ దొలఁగించి దిద్దుకొనును.

(చారుఁడగు భద్రుఁడు ప్రవేశము).

భద్రు:—జయము! మహారాజ! జయము!

శ్రీ:—(స్వగతము) సత్య స్వరూపిణి యాకాశవాణి యీ నెపమున నిటువచ్చెనని తలఁచెదను. తలఁపులోన సమయమునకు వచ్చితివి) శుభమగుగాక! ఏమి విశేషములు?

భద్రు:—(స్వగతము, [అధోముఖుఁడై - మెల్లఁగ] మహాపాపిని!—ఘోర కర్ముఁడను!—దురదృష్టవంతుఁడను! (ఒకజాబు శ్రీరామునిచేతి కందిచ్చును)
(శ్రీరాముఁడు చదువుచు మూర్ఛపోవును. సోదరులుపచారముచేయ సగము సగము తెలివిలో).

శ్రీ:—హా! అమ్మా!—అరుంధతీ! హా! భగవంతులారా! వసిష్ఠ విశ్వామిత్రులార! హా! దేవీ! భూతధాత్రీ! హా మామా! జనక! హా నాయన! హా! తల్లులార! హా పరమోపకారీ! లంకాపతీ! హా విభీషణా! హా! ప్రియసఖా! సుగ్రీవ! హా సౌమ్య! ఆంజనేయ! హా సఖీ! త్రిజటా! - మోసపోయితిరి! అవమానితులగుచుంటిరి రామహతకునిచేత! - అటుల కాదేని నేనెవఁడ నిప్పుడు వారలఁ జేరుకొనుటకు? - (బాగుగా తెలివంది

ధ్యానించి లేచి నిలిచి) దివ్యవిమానరాజా ! ఒక్కసారి విచ్చేయుము.

(పుష్పకమువచ్చి యెదుట వ్రాలును - సభ్యులు బొమ్మలవలె చూచుచుందురు.)

శ్రీ:—సోదర ! శత్రుఘ్న ! లెమ్ము ! దక్షిణ దిక్పాలుఁడగు రాజు సన్నిధికరుగుము, ఆ మహనీయునితో నావాక్యముగఁ జెప్పుము. "రాముని ప్రథమ దోషమును మన్నింపుఁడు. విప్రబాలుని ప్రాణముల విడిచిపెట్టుఁడు. రామరాజ్యమున వర్ణాశ్రమ ధర్మము లుచితరీతిని నెలకొల్పఁబడనున్నవి. అది మన యుభయులకు శ్రేయస్కరము." (శత్రుఘ్నుఁ డతివేగముగ వెడలిపోవును.)

శ్రీ:—భరతా !

భర:—(తటాలున లేచినిల్చి) ఆజ్ఞాపింపుఁడు !

శ్రీ:—శంబూకుఁడను వాఁడొకఁడు వింధ్యారణ్య ప్రాంతమున నీచకాంతులతో ఘోరతపము చేయుచున్నాఁడఁట. వాని వధింపనే నరుగవలయు. నే దిరిగివచ్చువఱకు నీవు నా స్థానమునందుండి యీ రాజ్యమును బరిపాలించుచుండుము.

(శ్రీరాముఁడు సభ్యులవంకఁ జూచును. అందఱును నంగీకారమును సూచింతురు.)

భర:—అన్నగారి యాజ్ఞ శిరసావహింపఁదగినది.

—బ్రాహ్మణోత్తమ ! శిశు సహితంబుగ నీ విమాన మెక్కుఁడు. (విష్ణుశర్మ యట్లుచేయును. శ్రీరాముఁడు కూడ విమానమెక్కి.)

శ్రీ:—తమ్ముఁడా ! లక్ష్మణా !

(లక్ష్మణుఁడతివేగమువచ్చి ప్రక్కను నిలుచును.)

శ్రీ:—నా యర్ధాంగిని - పరమపావనియగు సీతను, దండకాటవికిఁ గొనిపోయి, ఏముని యాశ్రమ ప్రాంతమునందైన విడిచిరమ్ము. ఇది ధర్మపరిపాలన పాశబద్ధుండగు నీ చక్రవర్తి కఠోర శాసనము. (విమాన మంతరిక్షమున కెగిరిపోవును. లక్ష్మణుఁడు దుఃఖభరమున నేలఁగూలును. భరతుఁ డుపచారముచేయును. సభ్యులు విచారించుచుందురు.)

ల:—హా చక్రవర్తి కఠోరశాసనము! కఠోరము! కర్ణకఠోరము హృదయకఠోరము! " లక్ష్మణా ! నీవిప్పుడేపోయి యాత్మహత్య గావించుకొనుము "-అని యాజ్ఞాపించినచో నా శ్రీరామ చక్రవర్తి యానతి నెంత యానందముతో నెఱవేర్చియుందును! " పరమపావని యగుసీతను " నీవ చెప్పుచుంటివికదా ! - " దండకాటవిని దిగవిడిచి " హా ! ఎంత ఘోరము ! ఎంత ఘోరము ! ఈ లక్ష్మణుఁ డిందులకుఁ దగఁడు - ఆ పనిచేయఁజాలఁడు !-నీమాట జవదాటను నేరఁడు ! ఏమిగతి ?

భర:—అదియా ! అందులకా ? - హా జానకీ ! హా ! తల్లీ ! జానకీ ! జానకీ ! జానకీ !-ఓ సోదరా ! రామచంద్ర !- ఎక్కడ రాముఁడు ? విమానముపై వెడలిపోయెను.

సు:—ఊరడిల్లుఁడు. ఊరడిల్లుఁడు-రాకొమారులు వా పోవుట తగదు. అయిననేమి విధికృతమిది ! - శ్రీరామునికి

మతిచెడినాయేమి ? అరే! భద్రా! తుచ్ఛా! రాక్ష
సాధమా! ఏమికల్లలు కూర్చివ్రాసికొని వచ్చితివిగా ?

భద్రు:—ఎట్టి నిందకునైనఁ బాత్రుఁడను. ఎట్టి శిక్షకునైన
నర్హుఁడను. శ్రీరామ సార్వభౌమ! ఈ నీచుఁడు,
క్రూరుఁడు, భద్రుఁడు, వీఁడు కేవల మసత్యముల
వ్రాసినాఁడు. నమ్ముఁడు. వీనికి దండనము విధింపుఁడు.
మీరు సుఖంబుండుఁడు. మీరు లోకములకు దల్లి
దండ్రులు. ఎవ్వరైన నీమాట నా యేలిక చెవినివేసి
పుణ్యము కట్టుకొనువారు లేరా! (అని వాపోవును.)

భర:—(భద్రుఁడిచ్చిన కాకితము నింతలో చదివి ముగించి)
భద్రా! నీవేమి చేయుదువు! నిన్ననవలసినదేమి ? నీవు
మాతండ్రిగారి కాలమునుండియు భక్తి విశ్వాసము
లతోఁ గొలుచుచున్నాఁడవు - మొదట సత్యము రచిం
చియు పిదప నిప్పుడసత్యమని యనృత మాడనేల ?
నీవు నీవిధి నిర్వర్తించితివి. భద్రా! పొమ్ము. ఇంకను
చిరకాలము సుఖవై జీవింపుము.

భద్రు:—ఇది నాపాలిటి కాశీర్వచనముకాదు. శాపవచనము.
నాఁకిక సుఖములేదు. హా! తండ్రీ! రామచంద్ర! హా!
తల్లీ! సీతమ్మ! మీ పవిత్రనామములతో పాటు ఈ
దుర్మార్గుని పేరుకూడఁ గల్పాంతమీ భువిపై నిలిచి
యుండును గాఁబోలు!

(అని విచారించుచు వెడలిపోవును.)

భర:—బాలునివలె రోదనముచేయుచు వెడలిపోయెనే.

ల:—భద్రుఁడననేమి? ఈచతుర్దశభువనములుకూడ రోదనము చేయుచున్నవి. హా! రామః - హా! సీత! నిరుపమాన సౌశీల్య ! రామైకజీవిత ! పరమపావని ! లోకమాత ! ఏమి సోదరా ? - కారణమేమి సోదర ? హా ! రామ !

సు:—ఈ ప్రశ్నము సహింపఁజాలకయె విమానముపై నధివసించి యీ పిడుగువంటి వాక్యమును జారవిడిచి యంతరిక్ష మార్గమున వెడలిపోయెను.

భర:—ఇందు నాకొక్క కారణము పొడకట్టుచున్నది. ఈవిష్ణుశర్మ భార్య యిందిరయను నామె జారిణియయ్యుఁ దన యుపపతియగు శంబూకుని తంత్రమువలన నిరపాయముగ నగ్నిఁజొచ్చెను. న్యాయమూర్తులు సీతా మహాదేవి చారిత్రము నుదాహరణముగఁ గైకొని ఇందిర దోషరహితయని స్థిరపఱచిరి. కాని సత్యముదాగదాయె. ఏతత్ఫలితముగ జనులు రావణుఁడీ శంబూకుని మాత్రమెయుఁగఁడాయని శంకింపఁ జొచ్చిరఁట. ఇందిరాగ్ని ప్రవేశమువలె సీతాగ్ని ప్రవేశము-అక్షరములు కావివి,సర్వలోక సంహారకంబులగు ప్రళయాగ్ని కీలలు గాని ! (కాగితము నలిపి నేలపైఁ బారవైచి నింగి దిక్కు మొగంబై).

హా రామచంద్ర ! ఈ దురదృష్టముఁగాంచి దురపిల్లుదుమా ! నీత్యాగ స్వరూపమునుగాంచి కొనియాడుదుమా ?

సు:—నీ తండ్రి సత్య పరిపాలనముకొఱకు పుత్త్రునిఁ గారడ పులకింపెను ! నీవు, అసిధారా వ్రతంబుగ ధర్మము పరిపాలించు నవసరంబునఁ బ్రజల మనములందెట్టి సంశ

యములకుఁ దావీయ రాదని నిశ్చయించి నీ యర్థాం గిని బరిత్యజించుచుంటివి !

ల:—"రాజ" శబ్దమునకు ఇది యర్థము - కాని నాహృదయ దౌర్బల్యము. నే నెటుల నీయాజ్ఞ ననుసరించి పూజ్యు రాలగు వదినెగారిని సమీపించి "అమ్మా ! ఆజ్ఞ మైనది. మిమ్ము నట్టడవిని దిగవిడిచి వత్తును. లెండు, నా వెంటరండు !" అని కోరుదును ? అంతకంటె మోస పుచ్చి తత్పాపము నే యొడిగట్టుకొనెద. "అమ్మా ! రథము సిద్ధముగ నున్నది" అని చెప్పెదను. పుణ్య గంగోదకంబుల జలకమాడను ఋషివాటికల దిరిగి యొకసారి సందర్శింపను ఇది వఱకే శ్రీరాముని యను మతి వడసియున్నదిగద ! - ఈ మోసగానికి సెలవిప్పిం పుఁడు. కుణమొక్కొక్క వజ్రపాతమువలె నాహృదయ మును వ్రక్కలు చేయుచున్నది.

(లక్ష్మణుఁడు వెడలిపోవును.)

భర:—(తలయెత్తి) సీతా రామలక్ష్మణులు వల్కలంబుల ధరించి వనవాసము చేయుచుండ నే నంది గ్రామము నందున్నపుడే యింతకంటె నాహృదయమునకు శాంతి యు సౌఖ్యమును గలిగెను.

సు:—ఇట్టి సమయములందె యుత్తమవీరులు ధైర్యము వహిం తురు.

భర:—అట్టివాఁడు హిమాలయసదృశుఁడు శ్రీరామచంద్రుం డొక్కఁడె ! - తలంచుకొన్న కొలదియు నా కన్నులఁ జీకటులు క్రమ్ముచున్నవి. తలతిరుగుచున్నది. హృదయ

వేదనము మిక్కుటమగుచున్నది. ఈ ధారుణి రజమై మహావాయుపథంబునఁ జెల్లాచెదరగు చున్నటులున్నది.

(భరతుఁడు లేచును - సుమంత్రుఁడు పట్టుకొని వానిని లోనికిఁగొని పోవుచుండును - తెరపడును.)

---

## అయిదవ రంగము.

సీత ఉద్యానవనము (సీతయు చెలికత్తె వేసమున నున్న శూర్పణఖయు సొగటాలాడుచుండిరి).

శూ:—పోయినది ! నా పందెము నెగ్గినది ! - ఇదిగో పటము సరిగదిద్ది పెట్టుము. మొన్నవిభీషణునిఁ జూచి వానియన్న యిటులుండునని యూహించి వ్రాసితిని.-ఏమి ? ధ్యానించుచుంటివి ? నిద్రలేచినప్పటినుండియు ఏలొకో అదియొక లాగున నుంటివి.

సీ:—ఏమియును లేదు.

శూ:—రావణ పటమని మొదటనే యెరిగినచో పందెమే వేయకపోదువు కాఁబోలు.

సీ:—ఎంతటి విరోధమైనను ఆమరణాంతమె. కాని యటు పిమ్మటఁ గూడ నిలుపఁదగదు. పుష్పము కంటకము, వెలుగు క్రీనీడ, ఒండొంటిఁ గలసియే యుండును. అమృతమును గాలకూటమును ఆపాల సముద్రమందె యుద్భవించును. ఈ పరస్పర విరుద్ధ ద్వంద్వ సమీకరణమే ప్రకృతి వైచిత్ర్యము ! .. ఉందురు సృష్టిలో నట్టివారును నుందురు. వానియందే ఆ మహాపాతక

బుద్ధియు సర్వోత్కృష్టంబగు పరమేశ్వర భక్తియు కూడ కాన నయ్యెడి! - కాని చెలీ! నేను వానిని గన్నెత్తి చూడలేదు. దోసిట ఫలములఁ బట్టుకొని పర్ణశాల ముంగిటకు వచ్చితిని. భిక్షుకుని జోలెలో వేయఁబోవు చుంటిని-ఇన్ని తలలు! ఇన్ని చేతులు! పదివేల మెరుపు లొక్కమారు మెఱసెను! పిడుగులవలె నేమియో వినఁబడఁజొచ్చెను. మఱి నేనెఱుఁగ. నేఁగన్నులవిప్పి చూచుసరికి మా పర్ణశాల కానరాదు. మొదటిసారియుఁ గడసారియుఁ జూచినదా యొక్కక్షణమునందె. ఇప్పుడు నన్నీపటము దిద్దుమనిన నేమి దిద్దఁగలను?

శూ:—పోనిమ్మా! ఆయపూర్వ వికృత రూపంబున కెట్లులైన సహజకళ వచ్చెనో లేదో పరీక్షింపుము.

సీ:—(పటము వంకఁజూచి) హా! చెలీ! నాకు వీనిఁజూడ నిప్పుడు నిజముగ జాలి గల్గుచున్నది. ఎంతటి వాఁడొక్కతుచ్ఛ కాంక్షచే నెట్లైపోయెనో! (కుంచె నా పటము క్రిందమోపి యేమో వ్రాయును) - నాకొక్క సందియము కలుగుచున్నదే!

శూ:—ఏమని?

సీ:—స్త్రీలకు స్వప్నమందైనను గలుగని యా నీచపు కోరిక పురుషులకేల గలుగుచుండవలె? దురదృష్టవంతుల కైన మాత్రము! (కన్నీరు కార్చుచు) ఒకనాఁడు నే నొక మహా పరాధము గావించితిని. అందుకుఁ దగిన ఫలము వెంటనే యనుభవించితిని. కాని యా ప్రాయశ్చిత్తమింకను చాలదు కాబోలు! ఇప్పుడు నిద్రలో

నాకదే తిరిగి స్వప్నమయ్యెను. మేలుకొనిన పిదపగూడ నేలకో నామనమును విచారమును భయమును వీడ కున్నవి. (శూర్పణఖ చేయి తన వక్షమునఁ బెట్టుకొని) చూడుము ! నాహృదయ మింకను నూరట చెందక కొట్టుకొనుచున్నది.

శూ:—అగును నిద్రలేచి నప్పటినుండియు, నేదో యొకలాగున నుంటివని మొదటనే చెప్పలేదా ! కావుననే వినోద మునకై సొగటాలఁ దీసికొని వచ్చి యాటపెట్టితిని. చిత్రపటములఁ దెచ్చితిని, నీకా యాందోళనము విచా రము తగ్గుచున్నటులే లేదు. ఆ స్వప్న వృత్తాంతము చెప్పరాదా? తరచియడిగిన నేమియును లేదందువు. ఎంతగుట్టుగల దానవమ్మా !

సీ:— మేము పర్ణశాలయందు కాపురముంటిమఁట. ఆమాయ లేడి వెంట నార్యపుత్త్రుఁడు కడుదవ్వరిగెను. నన్నును దమ్మునిని గొంతెత్తి పిలుచుచున్నటుల దూరము నుండి వినఁబడియెను. అంతట మఱదితో లక్ష్మణా ! చూచెదవేమి ? పరుగిడిపొమ్ము. ఏదో యాపదకలిగి నట్లున్నదా కంఠము" అని పల్కితిని.

శూ:—అవును. అప్పుడు వెంటనే లక్ష్మణస్వామి పయనమై యన్నగారికి సాయపడుటకుఁ జనెను. ఈ వృత్తాంతము నేనును వింటిని.

సీ:—అటులైనకానిదేమి ? నేను మిక్కిలి పాపాత్మురాలను. అనరాని మాటలని మఱఁది మనసు నొప్పించి పంపితిని. "ఆర్య పుత్త్రునికాపదలు గలుగనేరవు" అని యాతఁ

డెన్నివిధములనచ్చుఁ జెప్పినను వినక మనస్సున సమా ధానపడక "లక్ష్మణా! నీవు నాకు మఱఁదివికావా? వదినెను మోహించి అన్నమరణించిన పిదప... ..." ఛీ ఛీ పాపాత్మురాల! అప్పుడే నీనాలుక వ్రక్కలు కాదాయె! లక్ష్మణుఁడు ఖిన్నుఁడై తలవంచుకొని కన్నీరు కార్చుచుఁ జనియె. ఇంకను నాకాదీనవదనము కన్నులకుఁ గట్టినట్లగపడుచున్నది. ఏమిచేతును?

శూ:—అర్జునుఁడు వ్రాసిన చిత్తరువులఁ జూచిన పిదప నిద్రిం చుటచే పూర్వగాథ తిరిగి స్వప్నమయ్యెను. అంతకంటె వేఱేమున్నది! అమ్మా! అందులకై యింతగ విచా రించుట తగదు.

సీ:—దీనవదనుఁడై యెవరావచ్చుచున్నది. లక్ష్మణుఁడుకాఁడా! (అనియొక దిక్కునకు చూపును.)

శూ:—కాదు లక్ష్మణుఁడెక్కడ?

(ప్రయాణవేషము దాల్చి లక్ష్మణుఁడు దీన వదనుఁడై రెండవ దిక్కునుండి వచ్చును).

ల:—అమ్మా! మఱఁది లక్ష్మణుఁడు నమస్కరించుచున్నాఁడు.

సీ:—వత్సా! చిరంజీవివికమ్ము!-నీమూలముననే మేమిదివఱకె న్నియో యిక్కట్టుల దాటితిమి. ఇకముందును నీవు మహారాజునకుఁ గుడిభుజమవై యాతని యాజ్ఞనె పాలించుచుండుము. మీయన్నగారెందరిగిరి? ఏమి విశేషములు?

ల:—శంబూకుఁడను శూద్రుఁడొకఁడు ధర్మవిరుద్ధముగఁ దప మాచరించుచుండెనఁట. తన్మూలమున నొక పసి

బాలుఁడు తండ్రి బ్రతికియుండఁగనే పురిటింట మరణించెనఁట. శ్రీరామచంద్రుఁడా శంబూకుని వధించి బ్రాహ్మణ బాలుని బ్రతికింప నుద్యుక్తుఁడై చనెను.- కాని; అమ్మా! మీకోఱకు-రథము సిద్ధముగ నున్నది. వెంటనే బయలుదేఱుదము. (లక్ష్మణుఁడు నిట్టూర్పు విడుచును. శూర్పణఖ మారోన్మగము పెట్టి యానందము వెలిపుచ్చును.)

సీ:—ఏమో యంటిని గాని ఇప్పుడు నాకావనములకు రావలెనని లేదు.

ల:—అమ్మ! ఏల!

సీ.—(మందహాసముతో) పదునాలుగేండ్లు వనవిహారము సల్పితిమి! చాలదా?

ల:—"నీ వదినె కోర్కెను వెంటనే తీర్పవలయును. తల్లులుఁ గూడ సందేశ మంపియుండిరి." అనియన్నగారు సెలవిచ్చిరే!

సీ:—ఇప్పుడు నాకాకోరిక యున్నఁగదా వేఁడుక తీర్పవలసినది.- ఆర్యపుత్త్రుఁడు లేక యొంటరినై యావనములఁ జొచ్చుట నాకు మనస్కరించుటలేదు. ఇప్పుడు మించినదేమి? సారథి రథమును దిరిగి శాలలోనికిఁ గొనిపోవును. (శూర్పణఖ యాలోచించుచుండును.)

ల:—అక్కటా! నాయూహాయు ఫలింపదాయె! లక్ష్మణుఁడిఁక నేమియు చేయఁజాలఁడు. (స్వగతము) రామ! నీ యాజ్ఞను నీవె నెఱవేర్చుకొనుము.

శూ:—అమ్మా! నీతోఁ జెప్ప మఱచితిని. నీకు నిద్రాభంగము చేయనొల్లక మహారాజుగారు నాతో "దేవిని వనమందు నేను పుష్పకముపై వచ్చి కలసికొందును" అని చెప్పుమని యానతిచ్చి కార్యావసరమున మిక్కిలి వేగముగఁ జనిరి. అనుకూల దాంపత్యమందలి ప్రేమాతిశయమట్టిదియ! మహారాజుగారు నీకొఱకు వనములలో వెదకుచుందురేమొ కద నీ విప్పు డరుగకుండిన!

ల:—(స్వగతము) ఋజువర్తనులను సత్యము కాపాడునటులనే కపటులను మోసగాండ్రను నసత్యమే కాపాడుచుండును. ఈ పాపి లక్ష్మణుఁడు నీకు మిక్కిలి కృతజ్ఞుఁడు. కాని మాలినీ! నా మోస మెఱిఁగి యుండిన నీవా మోసము చేయవు గద! (శూర్పణఖను మెప్పుతోఁ జూచును.)

సీ:—అటులనా? అయినచో లక్ష్మణా! వెంటనే బయలు దేరుదము. (లేచును. లక్ష్మణుఁడు తలవంచుకొని ముందు నడచును. సీత యనుసరించును. శూర్పణఖ సీతవెనుక వచ్చును.) సఖీ! మాలినీ!

శూ:—అమ్మా!

సీ:—వనంబులఁ దడవుసేయము. మేము తిరిగి వచ్చు లోపల నీవు నా చిలుకకు "రామగీతిక" పూర్తిగఁ జెప్పవలయును సుమా!

శూ.—అటులనే.

సీ:—సన్నజాజు లార్యపుత్త్రునకు మిక్కిలి ప్రియమైనవి. పూసెజ్జ రచించుచో నా కుసుమంబులనే విరివిగ వాడుమనుము.

శూ:—మంచిది.

సీ:—ఈ పొదరిండ్లు చూచితివా అడవి దుబ్బులవలె నెటుల దిద్దుబాటులేక యున్నవో! వీనినెల్లఁ జక్కఁ జేయింపుము.

శూ:—మంచిది.

సీ:—ఇక నీవాగుము. పోయివచ్చెదను.

ల:—అమ్మా ఇటు-ఇటు.

(సీతాలక్ష్మణులు వెడలి పోదురు.)

శూ: - మంచిది (కలయఁజూచి).

శూ:—ఆటంకము తొలఁగి పోయినది. నా భావిమార్గము నిష్కంటకమైయున్నది. నాప్రయత్నములు ఫలించినవి. నా కోరికలీడేరనున్నవి. ఆహా! ఏమి నాయదృష్టము! నేనే యదృష్టవంతురాలను. రాముఁడు,ఇందీవరదళశ్యాముఁడు, నవమన్మథసుందరాకారుఁడు,మునిజనసమ్మోహిత మోహనాంగుఁడు; నా మనోహరుఁడు, నాఁడెవ్వతె తనపజ్జనుంటచే నన్ను తిరస్కరించెనో ఆపె నేఁడు లేమి-నన్నక్కునఁజేర్చి గౌరవించును ఈ సుందరమగు పొదరిండ్లలో; ఆ సన్నజాజులపూసెజ్జపై, ఆ చిలుక రామగీతిక గానముచేయుచుండ.-నాప్రియుని ప్రియము లెటింగించినందులకు, సీతా! నీకు పదివేలవందములు -

నా రామునితో రతికేళిం దేలి సుఖంతును! ధన్యతఁ గాంతును !

హాయి యీ రాత్రి !
చల్లని రాత్రి !
చుక్కలఁ దాలిచి
రావె యో రాత్రి !
చక్కని చంద్ర !
మక్కువ చంద్రిక
కౌగిటఁ జొక్కుచు
వలపులఁ జిమ్ముచు
వెంటనె రార !
కమ్మని చల్లని
మెల్లని గాలులు !
అరవిరి మొగ్గల
యందున నాడుచు,
అందము చందము
ప్రేమ యానందము.
ప్రకటిత హాసటు
విడువగఁ జేయుచు,
వేడుక మీరఁగ
సెలయేరులతో
నాడుచు పాడుచు
సరసకు రండీ !
రారా రామ !

రంజిలఁ జేయఁగ
జగదభి రామా !
రావే రామా !
రామా ! రామా !

(అని యానందాతిశయమునఁ బాడుచుండును.)

(తెరపడును.)

---

ఆ ఱ వ రం గ ము.

అరణ్యమందలి శంబూకుని యాశ్రమము. (శంబూకుఁడు ధ్యాన నిశ్చలుఁడై యుండును.)

శం:— నమ స్తే! శూర్పణఖే
నమ స్తే! రావణసోదరీ
నమ స్తే! మహామాయినీ
నమ స్తే! కామరూపిణీ
నమ స్తే! మహా యంత్ర తంత్ర మంత్ర ప్రాగల్భ్యవతీ
నమ స్తే! ప్రకృతి రహస్య సంవేదినీ
నమ స్తే! మద్గుర్వీ! - నమ స్తే! నమోనమః.

ఇఁక నొక్కటియే మిగిలియున్నది. అది పంచప్రాణ సంపుటీకరణము - భూచర జలచర ఖేచరంబులగు ప్రాణుల నెన్నిటినో యథాశాస్త్రముగ బాహ్యాంత రింద్రియముల విభజించి చూచితిని. అన్నకోశముకలదు. హృదయకోశము కలదు. శబ్ద, స్పర్శ,రూప, రస, గంధానుభవంబులఁ గొనివచ్చు నాడీ మండలము కలదు. మనస్సు ఫలితముగాఁగల మెదడుకలదు. ఎచ్చటను

ప్రాణముగాని, అదివిడిచి లేచిపోయిన యాత్మగాని ప్రత్యక్షము కాదాయె - అయినను ప్రాణమునుగూర్చి యిట్లు వినఁబడుచున్నది.

"హృదయకోశముకడనుండి యేగుతెంచు
నన్నకోశము వఱకును నాక్రమించుఁ
బద్మకోశము భాతిని బరిఢవిల్లు
మెఱపు తీగను మించుచు మెఱయుచుండు
సన్నపాటను వరిముల్లు సాటియగుచు
నిదియె ప్రాణంబు ! నాత్మయు ! నీశ్వరుండు !
కారణంబులకెల్ల నదె కారణంబు
అద్దానిచేతనే నఖిలలోకములు
సృష్టిస్థితిలయంబుఁజెందుచునుండు."

అయినచో ప్రాణము భౌతికము గాదు. కావున భౌతికశక్తిచే నది నిర్మింపఁ బడనేరదు. మానసికశక్తి ప్రేరణంబుననె యది యుత్పత్తి కావలయు. కావుననే యామానసిక శక్తులఁ బడయవలయు. అప్పుడే సృష్టికి ప్రతిసృష్టి సేయఁగలను. అప్పుడే నా యాప్సితములెల్ల నీడేరఁగలవు. పిదప వేఱె యాశ్వరుఁడు లేఁడనియు, నేన యా యీశ్వరుఁడననియుఁ బ్రకటింపఁ గలను - ముందు చిత్తమున కేకాగ్రత నలవఱచుకొనెద.

(పద్మాసనాసీనుఁడై నాసికాగ్రమున దృష్టినిలిపియుండును. తిరిగి)

నాతపము సిద్ధించెనా పాపమా యిందిరబాలుఁడు బ్రతుకు గాక !— మనసు నిజముగఁ బాదరసమువంటిది. ఈ కోతిని

బంధించి నిశ్చలముగ నిలుపుట బహుకష్టసాధ్యము. అయినను దృఢ సంకల్పమున కిల నసాధ్యమెద్దియు నుండఁ గూడదు.

(తిరిగి నిశ్చలుఁడై కూరుచుండెను. శ్రీరాముఁడు ప్రవేశము)

శ్రీ:—శంబూక !

శం:—(తటాలున లేచి నమస్కరించి) ఆహా ! నేఁడు కడునుదినము. సార్వభౌముఁడే మా పర్ణకుటీరమునకు విచ్చేసెను. సార్వభౌమా, ఈ కృష్ణాజినము నలంకరింపుఁడు. ఇవి నర్మదా జలంబులు-పాద్యంబుల ననుగ్రహింపుఁడు. (జలకలశము తెచ్చును, శ్రీరాముఁడు కూర్చుండక జలకలశము ముట్టక నల్దిక్కులఁ గలయఁజూచుచు శంబూకునిఁ బరీక్షించుచుండును.)

శం:—(రెండు పళ్లెరముల మాణిక్యములును ముత్యములును బోసికొనివచ్చి) మహారాజ ! నాభక్తి పూర్వకంబగు నీకానుక ననుగ్రహింపుఁడు. మదపుటేనుఁగుల కుంభస్థలమందలి తులలేనిముత్యములివి. కృష్ణ సర్పముల శిరోమాణిక్యము లివి. అమూల్యములు. స్వప్రకాశములు.

శ్రీ:—అక్కటా ! ఎన్నిజీవులు బలవన్మరణ మందెను. ?

శం:—ఎఱ్ఱని చక్కని పట్టుతేనె - పచ్చని తియ్యని తేనెతొనలు ; మృదువగు పనసతొనలు - కుందనమువంటి కొమ్మరఁటిపండ్లు - ఘుమ ఘుమ లాడుచుండు తీయమామిడిపండ్లు - (అని కొన్నిఫలములఁ దెచ్చి యటఁ బెట్టును.) ఒక్కటియైన స్వీకరింపుఁడు. నేధన్యుఁడ నగు

దును. మహారాజ! నన్ననుగ్రహింపుఁడు. నాయాశ్రమ మునకు వచ్చితిరని యెంతయో సంతసించితిని.

శ్రీ:—నీప్రాణములు దక్క నీవిచ్చునవి నేనన్యంబు స్వీకరింపను. (ఖడ్గము తీయుచున్నాఁడు)

శం:—అటులనే చేయవచ్చును. తమ మనోనిశ్చయంబునకుఁ గల కారణము నేనెఱుంగవచ్చునేని తెలిసికొనఁ గోరుచున్నాను.

శ్రీ:—నీ కట్టి సందియమేల ? రాముఁ డెన్నఁడును దోషము తెలుపకయె శిక్షించు వాఁడు కాఁడు. - శూద్రుఁడవగు నీవ్రుతపమిటు లాచరించుచుండుటయే కారణము.

శం:—బ్రాహ్మణుఁడే మానవుఁడా ?

శ్రీ:—కాదు. శూద్రుఁడును మానవుఁడె కాని విదియ తదియలనాఁటి చంద్రరేఖవలె ననంపూర్ణుఁడు.

శం:—అయినచో శూద్రుఁడనగుట నాదోషమా ? తపమాచరించుట నాదోషమా ?

శ్రీ:—తామ్ర పాత్రయు దూషితముకాదు. గోక్షీరమును దూషితముగాదు. కాని తామ్రపాత్ర యందలి గోక్షీరము విషతుల్యము.

శం:—వాల్మీకి మహర్షిని తమరేమందురు ?

శ్రీ:—శూద్రుఁడనను. నినుబోలు వారు మాత్రమే శూద్రులనఁబడుదురు.

శం:—నిర్భాగ్యులు - శూద్రులేల సృజింపఁబడవలయునో ! భూభారమునకు !

శ్రీ:—సంఘమునకు శూద్రుఁడు కూకటివేరు. కాని ఆవేరు పత్రపుష్ప ఫలాదులవలె సూర్యరశ్మి నాశించి భూతలమునకు వచ్చెనా వేరును వృక్షమునుఁగూడఁ నశించును.

శం:—ఈ ప్రకృతి రహస్యజ్ఞానము నార్జించు నభిలాషయుం గును దద్విషయమై కృషిసల్పుటయందును గలదోషమెట్టిదియో నాబుద్ధికి పొడకట్టకున్నది.

శ్రీ:—విప్పిచెప్పెద - చూడుము - అట్టి జ్ఞానమనునది యగ్నివంటిది. వజ్రాయుధమువంటిది. పసిబిడ్డచేతికిఁ గత్తినీయవచ్చునా? చిత్త పరిపక్వతనంది ముముక్షువులగువారల వశమై యున్నచో నీజ్ఞానము సూర్యునియందున్న తేజస్సువలె లోకమున కెంతయు శుభోదర్కమై సంపూర్ణ వికాసము నొడగూర్చును. అదియే చిత్తశుద్ధిలేక యింద్రియలోలురై కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులకు బానిసలై యుండు నరుల పరమయ్యెనేని యధర్మంబును నాస్తికత్వంబును బెంపొందించి, సుందరమగు నీవిశ్వసౌధమును రూపులేకుండఁ గూలఁద్రోయును. సవ్యాపసవ్యంబులు లేక కాలాకాలంబులు లేక జీవలోకమెల్ల నొక్కమారు మరణాచ్ఛాదితమైపోవును. అగ్ని నీవశమగుటనేగదా వ్యభిచారదోషమును మఱుగుపఱచుకొని, యసత్యమును సత్యముగాఁ బ్రకటితముచేసి, లోకుల విభ్రాంతులఁ గావించి ధర్మాశయుల నంశయాత్ములఁజేసి, యెంతటి హాని యొడగూర్చితివో

యిప్పుడైనఁ దెలిసికొనుము. తెలిసికొని పశ్చాత్తాప పడుము. ఇకముందైన నుత్తమ గతుల కర్హుఁడవగుదువు. ఏల సంశయించెదవ్రా దక్షిణహస్తమా? దుర్భరగర్భ ఖిన్న సీతనరణ్యముల పాలుచేసిన రాముని గాత్రమునకుఁ జెందిన దానవుగావా? నీకేటి కరుణ? నీవిట్టి కృత్యములకే తగుదువుగాక ! (అని ఖడ్గము నెత్తును).

శం:—సత్యము-హా రామచంద్ర! (అని నేలపైఁబడిపోవును)

(నేపథ్యమున).

"కదలుచుంటివే, బ్రతికితివిరా ! బిడ్డా
హా రామచంద్ర ! మహా ప్రభూ ! మహానుభావ"

(వెనుకనుండి శత్రుఘ్నుఁడు కత్తిపట్టుకొని)

శత్రు:—ఆగుము. అన్నా! శవమును నఱకనేల? నీ యానతి చొప్పున నావిప్రబాలుని ప్రాణములవదలి ధర్మరా జీపాపి ప్రాణముల లాగికొని పోవుచున్నాఁడు.

శ్రీ:—మేలు! ధర్మరాజ! మేలు! సార్థక నామధేయుఁడవు. నాకోరికి మన్నించి యీడేర్చిన నీకెంతయుఁ గృతజ్ఞతాపూర్వకంబును భక్తిపుర స్కృతంబును నగు వందనంబులు. నీవిచ్చటి కెటులవచ్చితివి?

శత్రు:—ఆదిక్పాలుఁడె "నీయన్నగారి కడ డిగ విడుతురమ్మ"ని కనుమూసి తెరచునంతలోఁ దన మహిమాతిశయంబు బయల్పడ నీ సన్నిధిం జేర్చెను. శ్రీరామనామమును దిక్పాలురుగూడ నెంతయు గౌరవింతురుకద !

(నేపథ్యమున).

"దిక్పాలు రొక్కరేయునవేల ? యీ సృష్టికెల్ల నాధార భూతంబులగు పంచ మహాభూతంబులుకూడ గౌర వించుచున్నవి. కొనియాడుచున్నవి. నీ మూలమున నేడు మాకు మాతొల్లిటి స్వేచ్ఛకలిగినది. ఈశంబూ కునివలని బానిసతనము తొలఁగినది. వాని యాజ్ఞ చొప్పున నధర్మమునకు సేవచేయు దౌర్భాగ్యము వదలి నది. శ్రీరామచంద్ర! సార్వభౌమ! నీవు సామాన్యుఁ డవు కావు. పరాత్పరుఁడవు!"

శ్రీ:—రాముఁడు తన విధిని మాత్రమె నిర్వర్తించుచుండెను. తమ్ముఁడా! వీని యాశ్రమమును బాగుగ పరిశోధించి రమ్ము. (శత్రుఘ్నుఁడు వెడలిపోవును. పునర్జీవితుఁడైన బాలునితో విష్ణుశర్మ ప్రవేశము).

విష్ణు:—మహారాజ! బాలుఁడు పునర్జీవితుఁడాయెను.

శ్రీ:—ధన్యోస్మి! ధన్యోస్మి!

విష్ణు:—మహానుభావ! మరణించినవానినిఁ బ్రతికించితిరి. మిమ్మేమని కొనియాడుటకును నా వాక్యము లల్ప ములు. తెలియక మూర్ఖుఁడనై యెన్నియో కారులాడి చితిని. అదియెల్ల నాపుత్త్ర శోకవికారమని యెను గ్రహించి నన్ను రక్షింపుఁడు. అజ్ఞుఁడను. అల్పుఁడను మహానుభావ! కృపానిధి! వేఁడుకొనుచుంటిని. క్షమిం పుఁడు. (శ్రీరాముని పాదములపైఁ బడఁబోవును).

శ్రీ:—(విష్ణుశర్మను లేవనెత్తి) అయ్యా! వలదు. కూడదు. ఇదియేమి ? తమరు పండితులు. ఈ రాముఁడు తమ యనురాగమునకు మాత్రమే పాత్రుఁడు. రాజ్య

మందుఁగల లోపములనెల్ల రాజున కెత్తిచూపుట ప్రజలకు ధర్మము. ఆలోపములనెల్ల సవరించుకొనుట రాజునకు విధి. అట్టిచో నేకుమింపవలసిన దేమున్నది? బ్రాహ్మణోత్తమా! ధర్మమార్గమున రాజ్యము పాలించుకొనుటకు వలయు దేహ మనోదార్ఢ్యము శ్రీరామునకుఁ గలుగుగావుతమని దైవమును బ్రార్థింపుఁడు.

(విష్ణుశర్మకు నమస్కరించును.)

విష్ణు:—పరమేశ్వరుఁడటులనే యనుగ్రహించును-సముద్రుఁడు సహజ సంపూర్ణుఁడయ్యు నూరక నదీజలములఁ దన లోనికిఁ గైకొనుచుండును. అందు లకీనదులపైఁగల ప్రేమయే కారణముగద!

(అతివేగముగ నిందిర ప్రవేశించి దూరమునుండియే నమస్కరించి).

ఇం:—ఈదీనురాలి దొక్కమనవి.

శ్రీ:—(సకరుణముగ) చెప్పుము.

ఇం:—నేను భర్తచే విడువఁబడినదానను. పాపాత్మురాలను, అస్పృశ్యను. మీరు నాకన్న బిడ్డను బ్రతికించితిరి. పావనమగు మీపాదధూళి నాశిరమునఁ దాల్చుకొననిండు.

శ్రీ:—(దక్షిణ హస్తముతో నభయము నిచ్చుచు) నీవేనా యిందిరవు? - బిడ్డా! నీకునుఁ దరణోపాయము గలదు.

ఇం:—నిశ్చయముగ శ్రీమన్నారాయణమూర్తియే మీరు!

శ్రీ:—(గంభీర మందహాసముఁ గావించును).

ఇం:—నన్ను మోసగింపకుఁడు. నేను మోసపోఁజాలను. నేను వంటచేసికొనుటకు పొయ్యియూదు నంతనె హాళరున నుండుచుండ.

"రాముఁడే దేవుఁడే
వాని చెంతకుఁబొమ్మ
ఇందిరా లెమ్మ"

అని బాలిగొని పలుకుచున్నటుల వినఁబడెను. ఏటిలోదిగి నీరు ముంచుచుండ నాకుండలోనికి నీరునిండుచు.

"రాముఁడే దేవుఁడే
ఓ వెఱ్ఱిదానా
వేగమే పోపొమ్మ
ఈ తరుణమందే"

అని పలికినటులుండును.

అన్నముతిని నేలపై పరుంటినా.

'నీయంత నిర్భాగ్యురాలెందుఁగలదు?
దేవుఁడో రాముఁడే యిటువచ్చియుండ
ఏలకో పోవటుల నీవిప్పుడైన"

అని భూమి యడుగున నుండి నా చెవిలో నెవరో పల్కుచున్నట్లుండును. మీదయ యీ మాటలను సత్యములని చూపుచున్నది. నన్నిఁక మోసగింపకుఁడు. నేను మోసపోఁజాలను.

శ్రీ:—భక్తులకు రాతియందును నీశ్వరుఁడు సాక్షాత్కరించు చుండును.

విష్ణు:—నీచురాల! మహారాజు మీదికిఁ బోయెదవు.

ఇం:—క్రిందు మీా దెబ్బఁగన్నై తిని. పాపిన్నై తిని. నాకిఁకఁ గష్టము, దుఃఖము, నిరాశ మాత్రమె మిగిలియున్నవి. నా పతి నన్ను బరిత్యజించెను. నా హృదయమునం దేదియో భయ మావహించి యున్నది. క్రుంగిపోవుచున్నది. నా దేహము నా కంటి కసహ్యమగుచున్నది. నా క్రీనీడ నన్నుఁజూచి వెక్కిరించుచున్నది. నాకే త్రోవయు, తెన్నును తెలియరాకున్నది. మహాత్మ! నిన్నె శరణు చొచ్చితిని. నన్నిందుండి కాపాడి దరిఁజేర్పుఁడని వేఁడు కొనుచున్నాను.

శ్రీ:—నీ వేమి చేయుదువు?

ఇం:—దేవా? నే నేమి చేయఁగలను? నా దేవుఁ డేట్లాజ్ఞాపించిన నటులఁ జేయుదును. తిరుగ నగ్నియందుఁ బడుమన్న నీమాఱు నిర్విచారముగ హాయిగఁ జితిఁ జొచ్చి బుగ్గి యయ్యెద.

శ్రీ:—నీతోడి జీవుల సుఖముకొఱకు పాటుపడుచు జీవింపుము. నీ శక్తివంచన లేక పాటుపడుము. ఏమియు చేయ లేనిచోఁ జీమలకు బియ్యపు గింజలఁ బెట్టుము. అవి సుఖముగ నుండఁ జూచుచుండుము. నీకను నానందము కలుగును. ఏదైన నెండిపోవుచున్న మొక్క నీ కంటఁ బడినచో దానికిఁ గొనిపోయి నీళ్లు పోయుము. అప్పుడు నీ హృదయమునకు శాంతి కలుగును. నిర్మలానంద మల్లన నీ మనసునందు వికసించును. ఈశ్వరుఁడు నీతప్పు మన్నించి సిన్నాశీర్వదించును. పొమ్ము.

ఇం:—(శ్రీరామునకు నమస్కరించి) ధన్యను.

శ్రీ:—పవిత్రురాలవు గమ్ము.
ఇం:—మహాప్రసాదము. (భర్తకు నమస్కరించును.)
విష్ణు:—లోకము నీకు మోసపుచ్చకుందువు గాక!
ఇం:—మహాప్రసాదము.

[తండ్రికడనున్న బిడ్డనుఁ జూచుచు గుండెపైఁ జేయి వైచికొని రెప్పల నప్పళించుచు వెడలిపోవును.]

శ్రీ:—(స్వగతము) కటకటా! అట్టిది గద యీ జీవి జీవితము. పుత్రప్రేమ!——(ప్రకాశముగ) బ్రాహ్మణోత్తమ! రాముఁడు తమ కొనర్పంగల కార్యము మఱేమైనఁ గలదా?

విష్ణు:—శ్రీరామచంద్రుఁ డొనర్పఁగల కార్యములు పెక్కులు-అసంఖ్యాకములు గలవు. కాని యీ విప్రున కికఁ గోరఁ దగిన దెద్దియును లేదు. మహారాజుగారి కడనుండి యీ బ్రాహ్మణుఁడు సెలవు వేఁడుకొనుచున్నాఁడు.

శ్రీ:—నాయందుఁ దమరీ వాత్సల్యభావము నె యుంచవలయు.

విష్ణు:—కలకాలము రాజ్యమేలుము. శ్రీరామరాజ్యము కల్పాంతమీ పృథివీమండలమునందలి రాజన్యులకెల్ల నాదర్శమై వెలయుఁ గాక! (విష్ణుశర్మ వెడలిపోవును).

శ్రీ:—పచారు చేయుచు పెద్ద నిట్టూర్పు విడిచి } ఇప్పటికీ రీతిగఁ గృతకృత్యుఁడనైతిని.

నా యర్ధాంగి యిది వినిన నెంత సంతసించునో! అర్ధాంగి! హా కష్టము! ఈ హత భాగ్యున కిక నెక్కడి యర్ధాంగి? హా! సీతా! చంద్రవదనా!—నిష్కళంక పూర్ణచంద్రవదనా! ఎందుంటివో—ఎటులఁ

గుందుచుంటివా నన్నాటక తలఁచి తలఁచి, వాపోవు చుంటివా ? లేదు. నిందించుచుంటివి. దూరుచుంటివి- ఛీ ! రామ ! నీవెంత నీచహృదయుఁడవు ! సీత, జానకి, భూపుత్రి నిన్ను నిందించునా ! - ఏమి నీ పేరాసలు ! నిజముగ సీత యిప్పటికి జీవించియే యుండదు ! సూర్యుఁ డస్తమించెను. అంధకారము ! ఇక సూర్యో దయము లేదు ! - అయ్యో ! తలక్రిందైనది, ఇప్పుఁడు నీకు జీవలోకము ! - ముగిసిపోయినది రామునకు జీవితప్రయోజనము ! వట్టి వల్లకాఁడు ఇప్పుడు జగత్తు ! నిస్సారము సంసారము ! కష్టప్రాయము శరీరము ! పాషాణము ! ఎందుకట్టియిది !

(శత్రుఘ్నుఁడు ప్రవేశము)

శత్రు:—సోదరా !

శ్రీ:—వచ్చితివా ? (నిట్టూర్పువిడిచి) ఈ శంబూకునకుచిత రీతి నగ్ని సంస్కారములు చేయింపవలెను.

శత్రు:—లోనున్నది యొక పెద్దకొప్పెర. దానియం దిమిడ్చి వాని ద్రావకములనే యందుఁ బోసిన నెంతకాలమైనను చెక్కుచెదరక నిలుచును. అందఱునువచ్చి వింతగ శంబూకుఁడన నెట్లుండునో చూచి పోవుచుందురు - లేనిచో ఉడుకుచున్నవి గంధకాదులు. మందుచున్న వానియందె వీనికంత్య సంస్కారము జరుపుట తగి యుండును.

శ్రీ:—తమ్ముఁడా ! అట్లనరాదు. అదికూడదు. దుష్టుని శిక్షించుటయే తగునుగాని, ద్వేషించుట తగదు.

శత్రు:—అన్నగారి సెలవు. (శత్రుఘ్నుఁడు వెడలిపోవును.)

శ్రీ:—ఇప్పుడే అయోధ్యను ప్రవేశింపవలయునా? (దూరము నుండి వెలుగును బాగయును నగపడును) అదె శంబూకుని రూపముకూడ లేకుండఁ బోవుచున్నది. అహా! ఒక విచిత్రనాటక మెటుల ముగియుచున్నది! అంతయునింతే! జగత్తే మహానాటకము. నాసీతలేని యీ రామనాటక మెటుల ముగియునో? - తెలియ రాదు.

(అగస్త్యుఁడు ప్రవేశము.)

అగ:—రామచంద్ర!

శ్రీ:—(ఉలికిపాటుతో) మునిపుంగవా! నమస్కారము!

అగ:—శుభమగుగాక!

శ్రీ:—(స్వగతము) మునిపుంగవు లేలకో పరిహాసించు చుండిరా? (ప్రకాశము) మీ కుఁగుశలమా! ఋషికోటి కెల్ల సుఖంబెగద! మీదర్శన భాగ్యము నాకిప్పు డిచ్చుటఁ గలుగఁజేసిన శుభప్రదమగు కారణ మెట్టిదో గద!

అ:—లోకకంటకుఁడై—రెండవ రావణునివలె బయలుదేరు చున్న యీ దుర్మార్గుని సంహరించితివని మాకెం తయు నానందముగలిగి నిన్నొకసారి తిరిగి చేరువకు వచ్చితివిగావున, చూచిపోవుదునని వచ్చితిని.

శ్రీ:—మీ దయావిశేషము, నాపూర్వ పుణ్యఫలము.

అగ:—మరియొక ముఖ్యకారణము గూడఁగలదు.

శ్రీ:—ఆనతీయవలయును.

అగ:—మేమొక యాగము సంకల్పించితిమి. నీవు మాయజ్ఞ శాలకు వచ్చి మాయాగము సఫలముఁ జేయవలెను.

శ్రీ:—మహానుగ్రహము.

(శత్రుఘ్నుఁడు ప్రవేశము)

శత్రు:—అహో! ఋషి సత్తమునకు అగస్త్యభగవానునకు శ్రీ రామానుజుఁడు శత్రుఘ్నుఁడు నమస్కరించు చున్నాఁడు.

అగ:—శత్రుఘ్న ! నీవు సార్థకనాముఁడ వయ్యెదవు !

శత్రు:— అనుగ్రహింపఁబడితిని - సోదరా ! దహన సంస్కారము పూర్తిచేయించితిని. వాని యాశ్రమమునుఁగూడ బాగుగఁ బరిశోధించి వచ్చితిని. చూడ భీతిగొలుపు యంత్రములెన్నియో మృత్యుదేవత వాహనములవలె వరుసలుదీరియున్నవి. ఒకచో లోహములెల్ల పలుతెరఁగులఁ దపించుచున్నవి. ఒకచో జీవరాసులెల్ల చచ్చి కొవ్వెరలలో ద్రావకములందు నానుచున్నవి. వివిధ వాయువులు వేఱువేఱరలయందు బంధింపఁబడియున్నవి. మానవుల పుఱ్ఱెలు పాదరసములోఁ గలిసి యుడుకుచున్నవి. వానపాములు అవిసెనూనెలో వేగుచున్నవి. గబ్బిలపురెక్కలు వీవనలుగాఁ గూర్చఁబడి యనేకములు పడియున్నవి.-మదపుటేనుగు మొదలు బురదపాము వఱకు - నెన్నియో యస్థిపంజరములొక చీకటి యరయందు వ్రేలాడుచున్నవి ఎటుచూచినను ఏది చూచినను రోతగనున్నది.

అగ:—సర్వమును రూపులేకుండ నాశనముచేయుఁడు. ఇట్టి యంత్ర తంత్రముల వ్యాప్తివలన లోకమునకు మేలు కన్నఁగీ డెక్కువ కలుగఁగలదు.

శ్రీ:—పూజ్యులగు మహర్షుల యానతి చొప్పునఁ జేయుము.

అగ:—వేగమెరమ్ము! నీవుకూడ నీసోదరుని వెంట మాజన్నము చూడరావలెను.

శత్రు:—(అన్నగారి దిక్కుచూచును).

శ్రీ:—మహాత్మ! క్షమింపవలయు, వాఁడయోధ్యకుఁబోవననుజ్ఞయిందు. నేను వచ్చుచుంటినిగద!

అగ:—కార్యావసరమగుచో నటులనే కానిమ్ము. రాజ్యము చక్కఁగ జరుగుచుండుటవలన మాకును బ్రయోజనముగలదు.

శత్రు:—శత్రుఘ్నునకు సెలవిప్పింపుఁడు.

అగ:—మంచిది.

శ్రీ:—సోదరా! ఇచ్చటి కార్యమంతయు సాంతముచేసికొని వెళ్లుము.

శత్రు:—అన్నగారి యాజ్ఞ.

శ్రీ:—అయోధ్యకు వెళ్లుము. నేనిట్లరిగితినని చెప్పుము. వచ్చెదనయోధ్యకు! త్వరగానే వచ్చెదను - రాముని మనస్సెక్కింత విశ్రాంతిఁగోరుచున్నది! - అయ్యది లభ్యమేని!

(అగస్త్యుఁడు శ్రీరాముఁడు నిష్క్రమింతురు).

శత్రు:—ఏమిది! నేఁడడుగున నగ్ని పర్వతము బ్రద్దలగుటఁ బయికెగయుచున్న ధూమముచే నావృతంబగునూర్వ

బింబమువలె నున్నది యీముఖకాంతి! - తేజము మందమై యించుక మాలిన్యమంది నట్లున్నది! ఉచ్ఛ్వాస నిశ్వాసములు దీర్ఘములు! సప్రయత్నములు! అన్నా! ఇపుడు స్ఫురించుచున్నది! ఆ కంఠమునందలి విచారపుఁ జీర! - ఆ చూపుల పరధ్యానము! - మాటల తడబాటు! - పలుకరించిన నులికిపాటు! - ఎద్దియో హాలాహలమును లోన స్తంభింపఁ జేసి దుర్బల లోకమునకు పైకి లేవెన్నెల రుచులఁ జూపుచున్నటులున్నది యీ ప్రవర్తనము! నాకు భయమగు చున్నది!

(తెరపడును.)

---

## ఏ డ వ ర ం గ ము.

వింధ్యపాదమండలి గ్రామము. వీధి. (భీముఁడు సోముఁడు, అనుమఁడు ప్రవేశము.)

సోము:—చూచావా? అనుమా! ఇప్పుడది యెక్కడుం డేదో కూడ ఆనమాలు లేకుండా బోయింది. వాఁడి శిష్యులమంటూ ఊరికే కనబడ్డవారినెల్లా బెదిరిస్తూ ఉండేవారు. ఒక్కఁడైన కలికంలోకి లేకుండా మటుమాయమై పోయారు.

అను:—కాదామరి. వాళ్లంతా అలా చెల్లాచెదరై పోయారో మనం బ్రతికిలా సుఖంగా భూమిమీద నిలిచి ఉన్నామో. ఆపాటి వైద్యాలు సౌఖ్యాలు లేకపోతే లోకాని కేమీలోటూ లేదు. మనమంతా చచ్చిపోము.

సోము:—కంటికెదురుగావుండి కనపడుతూన్నప్పుడు తెలియదు గాని నిజంగా శ్రీరామచక్రవర్తి అంటే యెవరను కుంటున్నావు ? శ్రీమన్నారాయణమూర్తి అన్నమాట కేవలము అవతారమని చెప్పవచ్చు - ఆలాగె నమ్ము కుని బ్రతుకుతూంది పాపమా యిందిర.

అను:—అవునట. ఇప్పు డదీ గ్రామము వదలి లేచిపోయిందట కాదా !

సోము:—నిజమె - విమానం దిగివస్తూనే "ఫో ! కులట-ఛండాలి ! నాయింటినుండి యీక్షణంలేచిపో. నీవెధవని మహారాజు చంపేస్తూన్నాడు. మరొకడిని చూచుకో ఫో" అని చావకొట్టి యింటినుండి గెంటేశాడు. "ఇందిరత్యాజ్యురాలు" అని చక్రవర్తే చెప్పేడట !

భీ:—(పెద్దనవ్వునవ్వి) అలాతప్పక చెప్పియుండును చక్రవర్తి. అదిపెద్దలకు తగిందే ! - ఈమధ్య "పాదుకల" కాలంలో మాయత్తవారి గ్రామమంలో వొకపెద్ద బడిపంతులుండేవాడు. ఎవడైనా సరే ఒకడు మరొకడి పుస్తకంముట్టుకున్నా, ఆలాచూచిలా, వాడిని పట్టుకొని చావకొట్టేవాడు. తనకొడుకు ఇంకొకడి పుస్తకముకాజేసి, చింపేసినా సరే పిర్యాదు చేసినవానిని "నీవింత అజాగ్రత్తగా ఎందుకుండాలి ?" అని పట్టుకు తిట్టి కొట్టేవాడు—చెప్పే దేముంది ? అది లోకస్వభావం.

4

సోము:—ఓయి! మొద్దు గుడ్డి చెవిటి చవట పెద్దన్నా! నీలోకజ్ఞానం అఖండముగా వెలుగుతూంది. నోరు మూసుకో. నువ్వెరగవా? మహారాజు మహాత్యాగం చూపించాఁడు. సీతా మహాలక్ష్మిని అడవుల్లో దించి రమ్మని లక్ష్మణస్వామి కాజ్ఞాపించాడట! నీవంటి దుర్మార్గుల నాలుకలు కోసేసినా పాపము లేదు.

అను:—ఛీ! ఇట్టివాడితో మాట్లాడరాదు. వీడిదగ్గఱ నిలవ రాదు.

(సోము, అనుమనిష్క్రమణము.)

భీ:—ఏమి! ఏమి! రాముఁడు సీతను పరిత్యజించెనా? రాముఁడు సీతను పరిత్యజింపఁగలఁడా? నామెుడలు జలదరించుచున్నది. దేహము గగుర్పొడుచుచున్నది. అయ్యో! పాపిని! అదియే నిజమైనచో నానాలుక కోసివేసినను పాపము లేదు!

(తెర పడును)

---

# తృతీయాంకము

## మొదటిరంగము.

—✿—

[భరతుని మందిరము.]

[ప్రవేశము: లక్ష్మణ భరత శత్రుఘ్నులు.]

లక్ష్మ:—ఎటులఁ జెప్పితినో నేనెఱుంగ. నాకన్నులఁ జీకటి క్రమ్మెను. కట్టినటె నేలపై నా పాదముల కడఁబడి పోతిని.

శత్రు:—హా! ఎంతకష్ట మెంతకష్టము!

లక్ష్మ:—నేఁగనువిచ్చి చూచుసరికి నాలోకమాత పైట చెరగుతో నాముఖముపై విసరుచు "నాయనా! లక్ష్మణా! నీవేల విచారించెదవు! నరుఁడు విచారించి యేమి చేయఁగలఁడు!" అని సన్నోదార్చు చుండెను.

భర:—అమ్మా! సీతమ్మ! ఎంత దురదృష్టము వచ్చినది తల్లీ!

లక్ష్మ:—ఇది మనదురదృష్టము - లోకపు దురదృష్టము - అంతఁ జటుకున లేచి యించుకదవ్వుల నధోముఖియై నిలిచెను, తనకన్నీరు నాకు మఱుగుపఱచవలెనని.

శత్రు:—సాధ్వి! పరమసాధ్వి!

లక్ష్మ:—కాని సంతతబాష్పధార యాపరమపావని పట్టు పైటను బూర్తిగఁ దడిపివేయుచుండెను. అటుల నిశ్శబ్ద

ముగఁ గన్నీరు గాఁర్చుచున్న దేవితుమాన్వితంబగు శోకము రూపందినట్లున్నది.

భర:—ఈ లోకము మేలుకొలుకిందలి దుఃఖములనెల్లఁదానె యనుభవించుచున్నది గద !

లక్ష్మ:—నిశ్చయము. నిశ్చయము. రెప్పల నప్పళించుచుఁ గెంపెదవుల ముడిచికొని పొంగివచ్చుచున్న దుఃఖము నెల్లలోనికి మ్రింగివేయు చున్నదోయన నొక్కగుటక వైచి-సకల కలుషహరంబగు తనమోమును బాగుగఁ జైకెత్తి మింట దృష్టినిలిపి సూర్య భగవానునకు నమస్కరించి నాపై మందదృష్టిఁ బరపుచు " నాకంటి కొలఁకులనుండి వేడికన్నీటినిఁక నీ పుడమిపైఁ బడ నీయను. అది నా యార్యపుత్త్రునకు మంచికానేరదు. పరిత్యజింపఁబడినను ఈ సీతకు శ్రీరామచంద్రుఁడే పతి. గతి. ప్రాణము. దైవము. అనిచెప్పుము. పూజ్యులగు నాయత్తలకు నమస్కారమును మఱదులకు దీవనలను జెప్పుము. 'నాపై దయగలదేవి ఈ సీతను మఱచి పోందు' అని యందఱ వేఁడుకొనుచుంటినని చెప్పుము. రథముపై రాజధానికి మఱలుము. లక్ష్మణా ! రాజ కార్యములందు మీయన్నగారికిఁ దోడ్పడుము. అటుల చూడకుము." అని చెప్పుచుండఁగా నాహృదయము ద్రవమైపోయెను. నాదేహము ముచ్చెమటలు పోయుచు నించుక వడకఁ జొచ్చెను. కన్నులవెంట నూఱకనీరు ధారగాఁ గారఁజొచ్చెను. అది కేవలము విచారమనియుఁ దోచదాయె. నాశిరస్సుభక్తిచే నమ్రమమాయె. చూపు

లా పాదపద్మములపై నిలిచినవి. చేతులు నమస్క-
రించుచుండెను.

భర:—ఆహా! ఏమి యీసందేశము! భావపారిశుద్ధ్యము! నిష్కలంకప్రేమ! నిర్మలభక్తి! సీతా! నీవు ధన్యవు. కాదు నీజన్మచే నీలోకము ధన్యమైనది. సతీత్వమున కాదర్శ మీ భువియందు నిలుపుటకై యవతరించితివి.

లక్ష్మ:—వనలక్ష్మిని నదీదేవతలను, పంచ భూతములను ధ్యానించి, శ్రీరామచంద్రుని భార్యను సంరక్షించు భారము వారలకప్పగించి, మనవదినె నానట్టడవిని మృత్యు యీడల నడుమ దిగవిడిచి రథమెక్కి వెనుదిరిగి చూడలేక బాష్పావరోధమున ముందు దారియుఁ గాన లేక, యశ్వములను చబుకుతోఁ దాటించి పగ్గములఁజే నుండి జారవిడిచి నొగలిపై వెనుకకుఁ జేరఁబడితిని. ఆమె చూపులు కొంతదూరమువఱకు నా వెన్నుపై బడుచున్నటులనే తోచుచుండెను. ఎటులనో ధైర్యము దెచ్చుకొని మోము వెనుకకు ద్రిప్పి చూచితిని. స్వర్గమునుండి జారి భూమిపై బడిపోయిన దివ్యకుసుమమాలవలె, నామె నేలపై మూర్ఛిల్లి పడిపోయినటులఁ దోచినది. నేను తిరిగి పగ్గములఁబట్టి యశ్వములనాపి వెనుకకు మఱలింపఁగోరితిని. కాని కంపించుచు వివశములైయున్న నా హస్తములకది సాధ్యము కాదాయె. వాయువేగమున గుఱ్ఱము లూఱక నా దేహమును ముందునకు లాగుకొని వచ్చినవి.

(ప్రతీహారి ప్రవేశించి.)

జయము మహాప్రభూ! మధురా పురవాసులట! "ఎక్కడి వాఁడో లవణాసురుఁడొకఁడు విజృంభించుచున్నాఁడు. ఈరాక్షసబాధ పడలేము" అనుచు నేడ్చుచు హజారమున గగ్గోలు చేయుచున్నారు.

భర:— కొలువుకూటమున దర్శనమిచ్చెదము. వారల నచటఁ బ్రవేశపెట్టుము.

ప్రతీహారి:—(వెడలిపోవును)

(లక్ష్మణ భరత శత్రుఘ్నులు లేతురు)

భర:—ఇంకను రాక్షసబాధ తగ్గకున్నది గద!

శత్రు:—ఎటుల దప్పును!

లక్ష్మ:—రామరాజ్యమున కివి దుర్దినములు కాఁబోలు.

(అందఱు వెడలిపోవుదురు.)

---

## రెండవరంగము.

### శ్రీరాముని కొలువుకూటము.

[రాఘవసింహాసన మనాక్రాంతము. దాని పాదపీఠముకడ భరతుఁడు నిజాసనము నలంకరించి యుండును. లక్ష్మణ శత్రుఘ్నులు కూర్చుండి యుందురు. ఉచిత పరివారము పరివేష్టించియుండును. మధురాపురవాసులు తమకష్టములఁ జెప్పుకొనుచుండిరి.]

1. పౌరు:—"అహో! ఇది రామరాజ్యంకాబోలు! వర్ణాశ్రమ ధర్మాలిచ్చటనే పడి చస్తూన్నవఁట." అని చెప్పి బలాత్కారముగఁ బంచముల లాగికొని వచ్చి కాలుసేతులు విఱిచికట్టి సవారులలోఁ బడవైచి బ్రాహ్మణులను

బోయలవలె మోయుఁడని కొరడాలతోఁ జావఁగొట్టు చున్నాఁడు. తనరాక్షసభటులనెల్లఁ బంక్తిగ గూర్చుండ నియమించి మన రయితులఁజూపుచు "ఈ బానిసలు గోవును గొలుతురట ! దానిమాంస మెక్కుడు రుచిగా నుండునేమొ పరీక్షింపుఁడు" అని చెప్పుచు నా సేద్య గాండ్రచే వారిగోవులనే కోయించి తన భటులకుఁ బెట్టించుచుండెను. "ఇదిగో ! మీా యిలవేల్పు" అని చెప్పుచు నల్లత్రాచునుదెచ్చి పుణ్యసతుల పాలిండ్లపై గరపించుచు గోలు గోలున నేడ్చుచుండిన వారినోట కాండ్రించి యుమియుచుండిరి.

2. పౌరు:—మహాప్రభూ! పోసిమ్ము! చచ్చిపోదమన్నను జావ నీయఁడు మాచేతి యాయుధములనెల్ల లాగికొనెను. గండుపిల్లి యెలుక పిల్లలఁబలె వేధించుచున్నాఁడు. ఈ బాధ లపూర్వములు. దేహములు జీవించియున్నవి. మనస్సులు మండిపోవుచున్నవి. హృదయములు క్రుళ్లి పోవుచున్నవి. ఈబాధలు ఈశిక్షలు నింతవఱకే నరక మందునుగూడ గల్పింపఁబడినటుల వినియుండలేదు. మేమెటులనో చెదరి బయటబడితిమి. అందఱును దమ దేశమందె బంధింపబడి మలమల మాడిపోవుచున్నారు. "రక్షింపుమో రామచంద్ర" యని గట్టిగ మొఱ వెట్టుకొనుటకైన సెలవులేక బారున నేడ్చుటకైన నాజ్ఞ లేక,మరణబాధకాదు. అట్టి బాధలుపడుచున్నారు. ఇంతవఱకు రాక్షసులును నుండిరికాని యిట్టి రాక్షసుఁడు లేఁడు. రావణుని మించిన క్రూరరాక్షసుఁడు బయలు

దేరినాఁడు. మహాప్రభూ ! జగమేలెడి తమరే రక్షింప వలె. వేఱు దిక్కు లేదు. అని శ్రీ రామచంద్రులవారి పాదములపైఁబడియేడ్చి చెప్పుకొందమని వచ్చినాము. దురదృష్టవంతులకట్టి యదృష్ట మబ్బునా ! ఆ మహా రాజుగారి దర్శనమే దొరకదాయె.

భర:- —నిజముగ నివియేవ్వో దుర్దినములు. అక్కటా ! మధురాపురీవాసులకెట్టి కష్టమువచ్చినది. ఇది యెల్ల నా ప్రజలది కాదు. మాదియే. ఇది శ్రీరామచక్రవర్తికే పరాభవము కావున నచిరకాలముననే లవణుడుండఁడని నమ్మెఁడు. ఈ కష్టవార్తత్వరగానే మహారాజునకుఁ దెలియఁగలదు. నారగస్త్య మహర్షి యాగమున కాహూయమానులై చనియుండిరి.

పౌరు:—పోనిండు - మహారాణి - యీ లోకము నెల్లఁ దిన చల్లనిచూపుల బాలించు మాయమ్మగారికడ మా యిడుములఁగూర్చి యొక్క మొఱపెట్టు కొందుము. ఈ దుఃఖమింత చల్లారును. అనుజ్ఞ యిండు.

శత్రు:—శ్రీరామచంద్రుఁడు సీతాదేవిని బరిత్యజించెను.

పౌరు:—కటకటా ! ఏమిమాట వినఁబడిది ! లోకమిఁక దిక్కు లేనిది. హతభాగ్యులము. పోయెదము.

భర:—మీకష్టము లెల్ల త్వరలోనే కడ తేరఁగలవు.

పౌరు:—(వెనుకకు మరలి) హా ! తెలిసినది! ఈ లవణాసురుని విజృంభణమే యాసన్న మహాప్రళయమునకు బ్రాతి పదికకాబోలు. అయ్యయో ! తల్లీ ! నీకెట్టి దుస్థితి వచ్చినది ! సీతా మహాలక్ష్మి వేడికన్నీటి బొట్టొకటి

భూమిపైఁబడిన యీపృథివి యెట్లు నిలువఁగలదు!
(నిష్క్రమింతురు.)

శత్రు:—అయ్యయ్యో! తుదకెటుల పరిణమించుచున్నది.

లక్ష్మ:—మంచిది. కానిమ్ము. ధైర్యమువహించి స్థైర్యము వీడక నిలుతము. ఈ కష్ట తరంగము మనపైనుండి యవ్వలికిఁ దరలిపోక యెప్పటికి నిటులనే నిలుచునా! కాలము కేవలకష్ట పూరితమేనా!

భర:—ఎట్లైననగు గాక. ఇప్పటి కర్తవ్యమేమి? ముందు లవణునిపై దండు నడపుటయా! అన్నగారికీ వార్త నెఱింగించుటయా!

లక్ష్మ:—రెండును జేయవచ్చు నిప్పుడే.

ద్వా-పా.—(ప్రవేశించి) జయము మహాప్రభూ! జయము.

భర:—ఏమి?

ద్వా-పా:—మిథిలనుండి రాయబారి వచ్చియున్నాఁడు. (సోదరులొండొరులఁ జూచుకొందురు.)

భర:—సరే ప్రవేశమిమ్ము.

ద్వా-పా:—చిత్తము. (వెడలిపోవును)

భర:—అక్కటా! ఇంకనాయోగాగ్ని క్రోధాగ్నియై ప్రజ్వలించును కాఁబోలు.

శత్రు:—కాదు. వారు మహాజ్ఞానులు.

లక్ష్మ:—విందుము గదా! మామగారి సందేశమెట్లుండునో యది!

(రాయబారి ప్రవేశము.)

రాయ:—(సగౌరవముగ నమస్కరించును)

భర:—అయ్యా! భరతుఁడు మీఁకు స్వాగతము నిచ్చుచున్నాఁడు. ఈ యాసనమలంకరింపుఁడు.

శత్రు:—మామగారును నందనును కుశలమా!

లక్ష్మ:—విదేహరాజ్యంబెట్టి యలజడులు లేక సుఖంబున్నది కదా!

భర:—ఏదియో కార్యార్థమై వచ్చినటు లున్నది.

రాయ:—(తన యాసనమున గూర్చుండకయే దానిముందు నిలువఁబడి) ఆహా! మీ మామగారును నందనును కుశలముగనే యుండిరి. విదేహరాజ్యముకూడ నెటులుండవలయునో అటులనే యున్నది. నేను గార్యార్థినై యే వచ్చితిని. శ్రీరామచక్రవర్తితోఁ గొన్నిమాటల జెప్పుమని నన్ను మా పురోహితామాత్యులు పంపిరి. కాని నా కిచ్చట నా చక్రవర్తి.

లక్ష్మ:—అన్నగారగస్త్యులవారి యాగము సందర్శింపఁజని యుండిరి. సోదరుని భరతుని ప్రతినిధిగా నియమించిరి.

భర:—జనకచక్రవర్తి మిమ్మంపియుండలేదా!

రాయ:—కూతు నవస్థవిని మా జనకమహారాజు రాజ్యముఁ బరిత్యజించి రాజభోగముల విడిచి మనశ్శాంతికొఱకు తపస్సుచేసికొనఁగోరి చంద్రద్వీపమునకుఁ జనిరి. మిథిలయెల్ల కంటికి మంటికి నేకధారగ విలపించుచుండెను. కావునఁ బ్రజారంజకుఁడగు శ్రీరాముఁడే స్వయముగ రాజులేకయున్న మారాజ్యముగూడఁ బరిపాలించుగాక యని కోరుచుండిరి. ఎవరు పరిపాలించిన నేమి! ప్రజల

రంజింపఁజేయుటయొకదా ముఖ్యకర్తవ్యము అనికూడ చెప్పుమనిరి.

భర:—రాయబారీ! ఈ సందేశమును శ్రీరామునికెఱింగింతుము. ఇందుకర్తవ్యము వారే నిర్ణయింపవలయు.

లక్ష్మ:—మిథిల యొక్కటియె విలపించుచున్నదా! అయోధ్యయు దుఃఖించుచున్నది. మేమును విచారించుచుంటిమి. అన్నగారైన నానందముతో నాపనిచేయలేదని మీ పురోహితామాత్యు లెఱిఁగియుందురు.

శత్రు:—అట్టిచో నిట్టి నిష్ఠురములాడి యేమిప్రయోజనము!

భర:—రామచంద్రుఁడు మీసానుభూతికి మాత్రమే పాత్రుడు. అని నామాటగ మనవిచేయుము. అక్కటా! జనకుని మనస్సెంత ఖేదపడెనో స్వర్గమందున్న మాతండ్రిగారు మాత్రమే తెలిసికొనఁగలరు.

రాయ:—మనమేమిచేయఁగలము! సర్వము విధివిలసితము. నేఁ బోయి వచ్చెదను.

భర:—మంచిది. (రాయబారి వెడలిపోవును)

భర:—అన్నగారు వచ్చువఱకు నేనీ రాజ్యమును భరించి పాలింపఁగలనా!

ద్వా-పా:—(ప్రవేశించి) జయము మహారాజ జయము. ఎవ్వరో ఋషిపుత్త్రులు వచ్చి యీ లేఖ నాచేతఁబెట్టి "మీ యేలికకిమ్ము" అనిచెప్పి వెడలిపోయిరి.

భర:—ఏది యాలేఖ.

ద్వా-పా:—(ఒక జాబునిచ్చి వెడలిపోవును)

భర:—" రామా! నీవు చేసినపనిమాకు వినవచ్చెను. సీతలేని యయోధ్యకు మేము రాఁజాలము. మేము నరణ్యాను లందే కాలము వెడలఁబుచ్చెదము.

కౌసల్య—అరుంధతి.

కైకేయి—సుమిత్ర."

(అని చదివి వెనుకకుఁ జేరఁబడి) కాదు. లక్ష్మణా! కాదు. నీ వేమొ యనుకొనుచుంటివి. కాని మనము నిజముగా నధఃపాతాళమునఁబడి మునిగిపోవుచుంటిమి!

శత్రు:—అన్నా! సీతయన నేమొ నేడు కదపూర్తిగఁ దెలియ వచ్చుచున్నది!

లక్ష్మ:—ఒకటి లేనప్పుడే దాని విలువ నిజముగా బోధపడును.

[కృషీవలులు రాజసేవకుల నెట్టికొనుచు సభలోనికివత్తురు].

రా-సే:—ఏమిది! వచ్చినపని చెప్పరాదా! ఊఁటకత్రోసికొని వచ్చెదరేమి! రాజాజ్ఞ క్రూరమైనది సుడీ!

కృషీ:—మహాప్రభూ! రామచంద్ర! బ్రతుకలేము. చచ్చి పోతున్నాందేవా! ఏమిదిక్కు. దరికానరాకుండా ఉంది.

భర:—వారు మిక్కిలి యార్తులై యున్నటులున్నది. నిరాతంకముగ వారిని లోనికివచ్చి తమ కష్టములుగూర్చి చెప్పుకొననిండు. దారి యిండు.

[రాజ భటులు దారియిత్తురు. రయితులొక్కుమ్మడి వచ్చి చాగిలపడి లేచినిలిచి శూన్య సింహాసనమునుజూచి రిచ్చ పడి ఖిన్నులై నిలుతురు].

భర:—అన్నలార ! హజారమున క్షణమైన నిలువనోపక మిక్కిలి యాత్రముతోవచ్చితిరి. వచ్చి మీకష్టము లేవియో చెప్పకొనక యూరకె రెండోరులఁ జూచుకొనుచు లోలోన గొణుగుకొనుచు మిన్నకుంటిరేల ! రాజమర్యాదలనైనఁ బాటింపక రాజసేవకుల నెట్టుకొని వచ్చితిరి. మీకు నేఁడు వచ్చినముప్పెట్టిదియో తెలుపక జాగుచేసెదరేల!

కృషీ:—ముప్పు కేమున్నది మా రాజా ! మాకిఁక బ్రదుకు దెరువు లేదండి.

లక్ష్మ:—అది యేలయో ఆసంగతి యే మేము వినఁగోరుచున్నది.

శత్రు:—పాడియుఁ బంటయు మీ సొమ్మైయుండ మీ కేమి లోటువచ్చినది !

కృషీ:—పాడి, పంట, లోటండి మా రాజా! ప్రభువులను గ్రయించి యినాల! శ్రీరాములవారు మాతండ్రి మా రాజు పట్టంలోఉంటే యేయిదానొ్న యీపాటి కల్లా హాయిగా కుప్పలూ్నర్చుకునే వాళ్లమండి.

భర:—మీరు నిజము చెప్పితిరి. సరే. ఇప్పుడు మీకు వచ్చిన యాపద యేమి! చెప్పుడు. వీలగు నెడల మేమె చక్కఁ జేయుదుము. లేనిచో శ్రీరాములవారి కీవార్త యెఱిం గింతుము.

కృషీ:—ఎక్కడ సల్లినా యేవైరు సల్లినా పోసిన యిత్తనాలు పోసినట్టె ఉంటాయికాని పచ్చని ఆకంటా ఒకటి మొల దండి మారాజా! యిదివర్లో మొలిసిన వైర్లకి నీరె డితే మొడుతూండగానే యింకినేల పొడారిపోద్దండి.

పెద్దింత లేసి బీటలు తీద్దండి. ఏలిన వారొచ్చి పరీచ్చిం
చొచ్చండి. ఏ యేలసూసినా చల్లని తల్లి కొళ్లు సలసల
కాగుతూన్నట్టుంటదండి. మారాజ! రాత్రి యేళెన్ని
టిలో పొలాన్న నడుస్తావుంటె కాలికిం దెచ్చగ తగుల్తా
వుంటదండి. ఇదంతా ఏంశిత్రమో ఏంమాయో
మాకేం తెలకుండా కొట్టుకుంటూ ఉన్నాము. మారా
జులు మాకేదైన ఆహారం కాపరిస్తేకాని మలమల
మాడిపోతూన్నాం. దొరగారు మమ్మెల్నెలా కటాచ్చి
స్తారో! మేమంతా ఏలిన వారి బిడ్డలం మారాజా!
సచ్చిపోతా ఉన్నాం. దొరగారాలహించాల.

భర:—చక్రవర్తి నిలువకొట్లనుండి ధాన్యము మీకెల్లఱకుఁ గుటుంబముల వరుబడిని ఏకవత్సర గ్రాసము కొలిపింతుము. పుడమి సస్యముల పోషింపకయున్న నావిషయమునుగూర్చి మహారాజగారు యోజించి కర్తవ్యము నిశ్చయింతురు. మీరు పొండు. విచారింపకుఁడు.

(రయితులు సాష్టాంగపడి వెడలిపోదురు.)

భర:—దీనికి నదియే కారణము గద.

లక్ష్మ:—తన గర్భవాసము దురవస్థనుగాంచిన పృథ్వికి మాత్రము దుఃఖమాగునా!

శత్రు:—ఒకవంక రాక్షస విజృంభణము. ఒకవైపు బాంధవ కష్టనిష్ఠురములు. కట్టెదుట ఘోరాకృతిదాల్చిన మహాక్షామము.

భర:—తమ్ముండ్లారా! ఇతికర్తవ్యతా మూఢుడనగుచుంటిని. లక్ష్మణా! నీవు వెంటనేపోయి సంగతులెల్ల నెఱింగించి యన్నగారిని దోడ్కొని రావలయు.

లక్ష్మ:—మంచిది. ఇప్పుడే బయలుదేరుదును. (వెడలిపోవును).

శత్రు:—లవణుం బరి మార్పసైన్యముల సమకూర్చుచుండుట మంచిది కాదా!

భర:— అగును. తమ్ముండా! నీవాపనియందుండుము.

శత్రు:—అటులనే చేసెదను. (వెడలిపోవును).

భర:—అమ్మా! సీత! ఈ సామ్రాజ్య లక్ష్మివి నీవ! నీవు లేక యీరాజ్య మెటులుండును. ఇటులనేయుండును. హా! రామచరిత్ర!

(తెరపడును).

---

## మూఁడవరంగము.

### అరణ్యమున నగస్త్యాశ్రమ ప్రాంతము.

[చేత మణిహారము వ్రేలాడుచుండ శ్రీరాముఁడు ప్రవేశము]

శ్రీ:—పూజ్యురాలు. ఋషిపత్ని, లోపాముద్ర, నాకేల యీవలయు నీమణిహారము! ఇప్పుడు దీనికేమి వినియోగము! అక్కటా! ఈజీవితమునకేమి వినియోగము.- మహర్షుల సేవించుట, మహాక్రతువు సందర్శించుట నాకు గొంత మనశ్శాంతిం బ్రసాదించెను. ఇప్పుడు నేనీ వనమునందే తపముచేసికొనుచు దినముల దొరలించెదను. హా! హా! రాముఁడెంత భీరు

వగుచున్నాఁడు! తాపసవృత్తియా నాకు విధ్యుక్తము!- అయ్యో! నేనెటుల నింకను రాజ్యము చేయుదును! ఎందులకు నాకీరాజ్యము! ఎవరికొఱకు! ఓ పంచభూతములార! నన్నొకసారి మనసార రోదనముచేసికొననిండు! - ఓ సీతా! పూర్ణగర్భిణీ! పరమపావనీ! ప్రేమస్వరూపిణీ! ఎందుంటివో! ఏమైతివో! ఇంక నాకీ కన్నులకుఁ గానరావు గద!

[కన్నులు మూసికొని మూర్ఛిల్లును. సీతావేషమున
శూర్పణఖ ప్రవేశము].

శూర్ప:—రామా రామా రావే రామా
జగదభిరామా రావే రామా
గగనవారిధుల గాంభీర్యఁబును
కలువరేకుల కోమలత్వమును
తొలకరిమబ్బుల తేటనిగ్గులును
అమృతకిరుఁణుని యాహ్లాదత్వము
ప్రకృతియందలి సౌందర్యంబును.
సుందరస్నేహపు సమ్మోహనమును,
సరసంబుగ రూపందిన రామా
లెమ్మా రామా నీవిటులయినను
నే నెటులోర్తును, రామా,
లెమ్మా రామా, జగదభిరామ!

[అని పాడుచుఁ బ్రేమమీఱ కుసుమితపల్లవాదులతోడను
చీరచెరగుతోను విసరుచుండును. ఒకసారి నుదుటిమీద
చేయివేయఁబోవును].

శ్రీ:—క్షుద్ర మీ హృదయ దౌర్బల్యము. క్షుద్రము! (శూర్పణఖ యదిరిపడి రెండడుగులు వెనుకకు వేయును, ఒండొరులఁ జూచుకొందురు.)

శూర్ప:—నాథ!

శ్రీ:—(మారుపల్కఁడు).

శూర్ప:—పలుకరాదా! దయరాదా! ప్రాణనాథ!

శ్రీ:—"ఉన్సు".

శూర్ప:—కన్నెత్తి చూడరాద! అంతమాత్రము నే నోచ లేద! అక్కట! నేఁబరకీయనా!

శ్రీ:—కటకటా!

శూర్ప:—అలనాఁడు శూర్పణఖతోఁ గూడ మేలమాడితివే!

శ్రీ:—(మఱియొక్క దిక్కు చూచుచు) ఇస్సిరో! వీఁడా రాముఁడు గాఁడు.

శూర్ప:—పూర్వపరిచితములై తొల్లిఁటి మన కష్టసుఖముల నుద్దీపింపఁజేయు నీవనములందే నన్నొంటరిగ బ్రతుకుమని శాసించితిరిగా! ఇంతకంటె నన్నా హిమాలయముపైఁ బడవేయరాదా! ప్రాణేశ్వర! నావలనిదోషమేమి! నేనేమి పాపము చేసితిని!

శ్రీ:—(అభిముఖుఁడై) నీవు రాణివైతివి! -(అధోముఖుఁడై) ఒక్కొక్కయెడఁ బ్రజలయందలి దోషపాపముల ఫలము ప్రభువులె యనుభవింపవలసి యుండును. సర్వముఁ దెలిసినదానవు. వేఱ యడిగెదవేల?

శూర్ప:—అదియే నా దురవస్థకెల్ల మూలమైనచో నిప్పుడు నేను రాణినిగాను మీరును వనములయందె యున్నారు

గదా. మనమిచ్చటనే పర్ణశాల నిర్మించుకొని వాన ప్రస్థులమై సుఖముగ నుందము. రాజ్యభోగము లింత కంటె నెక్కుడు కావుగద.

శ్రీ:—భార్యకొఱకు రాముఁడు రాజ్యము నరాజకము చేసెనని లోకమునిందింపదా! అది మనకుఁ బాతకము గాదా!

శూర్ప:—నిజముగ సీతయందు మీకు విశ్వాసము కలదేని నీలోకముతో మనకేమిపని! రాజ్య మరాజకము కానేల! భరతుఁడు లేఁడా! లక్ష్మణుఁడుగలఁడు. శత్రుఘ్నుఁడు గలఁడు. వారిలో నసమర్థు లెవ్వరు.

శ్రీ:—ఈశ్వరా! నాకిప్పుడేది కర్తవ్యము! (ఉచిత పరివారముతో లక్ష్మణుని ప్రవేశము. శ్రీరామునకు నమస్కరింతురు. శూర్పణఖ మఱుఁగున కరుగును.)

శ్రీ:—(స్వగతము) మీరును సమయమునకే వచ్చితిరి!

లక్ష్మ:—(నమస్కరించి) అన్న! అగస్త్యులవారి యాగము నిర్విఘ్నముగ సాంతమయినదా!

శ్రీ:—అట్లె! మన రాజ్యంబునకు సుఖంబేకద!

లక్ష్మ:—ఏమని విన్నవింతును! సమస్తయంత్రోపకరణములఁ గలిగియు నావికుఁడు లేని యోడ తుపానునందుకొట్టుకొను నట్లే కొట్టుకొనుచున్నది. మధురయందు లవణాసుర విజృంభణము .. అయోధ్యయందు మహాక్షామము! - చెప్పవలసినదేమున్నది! అన్నగారు మావెంటనే విచ్చేయవలయు. నే నసమర్థుఁడను. కర్తవ్య మూఢుఁడనైతిని. అని భరతుఁడు మనవి చేయుమనెను.

శ్రీ:—(స్వగతము) నాఁడు భరతుఁడు అయోధ్యకు రమ్మని పిలువఁ బితృవాక్య పరిపాలనము ముఖ్యము గావున రాఁజాలనని ధైర్యముగఁ జెప్పఁగల్గితిని!-కాని యిప్పు డేమని చెప్పుదును! ఏమనుటకును నాకే సిగ్గగు చున్నది!

పరివారము:—ప్రభువు వారు లేనిరాజ్యము సూర్యభగవా నులు లేని లోకమువలె శోభావిహీనమై యాంధకార మయమై దుర్భరమగుచున్నది! దేవా!

శ్రీ:—వచ్చెదను. (నల్దిక్కులఁ గలయఁజూచును. శూర్పణఖ కానరాదు.) లక్ష్మణా మీ వదినె.వచ్చెద నయోధ్యకు- (వెడలిపోవుదురు.)

(శూర్పణఖ ప్రవేశము.)

నా యాశాభంగమునకి లక్ష్మణహతకుఁ డే కారణము! వీనికిఁ గూఁడ దగిన ప్రాయశ్చిత్తముఁ జేయింపలేనిచో నేను శూర్ప ణఖనుగాను. అక్కటా! ఇటులపై నేమిచేసిన నేమి!

మోసమాయె నెంతో! ఏమి సేతునయ్యో!

1. కాఁగిటఁ జిక్కెను వీఁడని నమ్మఁగ, ప్రియుఁడదె దవ్వులఁ బోవుచునుండెను ॥ ఏమిసేతు ॥

2. ముద్దువెట్టుకొన నందెను ప్రియుఁడని ఆసతో నమ్మితి నంతలోనె యిటు, దూరముపోయెను॥ ఏమిసేతు॥

3. చేచాపఁగనే గగనము వలెనిటు నందుచునందక దాటిపోయెనిఁక॥ ఏమిసేతు॥

ఇంకనాసీతా వేషమేల, తీసివైతును.

(తెర పడును.)

## నాలుగవరంగము.

వాల్మీకియాశ్రమ సమీపమందలి యరణ్యము.

[స్నానముచేసి నారచీరఁగట్టికొని సీత ప్రవేశించుచున్నది. నేపథ్యమున లాలిపాట.]

లాలి శ్రీరామరామ, లాలినా చిన్నిరామ
ఆపదలు లేకుండ నీభువనమును రక్షించుచు,
నీతండ్రియున్నారుగా నిద్రపో చిన్నిరామా
జోలనా చిన్నిరామ జోలశ్రీరామరామ.

(అని వినఁబడును.)

సీత:—నేను స్నానముచేసి వచ్చులోపలఁ బిల్లలు మేల్కని యేడ్చుచుండిరి కాబోలు. వారల లాలించి నిదుర పుచ్చుచున్నది. ఈ యిల్లాలెవరో నా కెంతయో సాయపడుచున్నది. కాని తనపేరు నూరు నేమియుఁ జెప్పకున్నది. దయామయుఁడగు దేవుఁ డెక్కడి కక్కడి కేదోయొక యాధారముఁ గనఁబఱచుచునే యుండెను. (వెడలిపోవును.)

(తెరలేచును.)

[ఒక మఱ్ఱిక్రిందఁ దీగలతోఁ గట్టఁబడిన పూలతొట్టి. ఊయెల యందు కుశలవుల నూచుచు నిందిర ప్రవేశించును.]

ఇంది:—బాలురు నిద్రపోయిరి. శిశువులు క్షణములో నిదురింతురు. వారికీ ప్రాపంచిక సుఖదుఃఖములు రాగద్వేషములు నుండవు. సదా నిర్మలానందమునే యనుభవించుచుందురు. కావున వారిరాగముగూడ రమణీయమైన

ముద్దుగనుండును. నేఁడు సీతయింకను రాకున్నది. తడ వాగినది.

(సీతప్రవేశము.)

ఇంది:—అమ్మా! ఈదినము చాలప్రొద్దుపోయినది. పిల్లలు లేచి పాలకొఱకేడ్చిరి. ఎటులనో వారినిఁ దిరిగి నిద్ర పుచ్చితిని.

సీత:—పాలకొఱకేడ్చితిరా నా కూనలార! నేనేమి సేయు దును! దురదృష్టవంతులు కానిచో సీతకడుపున నేల పుట్టుదురు! (అని తొట్టిలోని బాలురఁదీసి ముద్దిడికొనఁ బోవుచుండ)

ఇంది:—తల్లీ! లేపకుము. కలతనిద్రయగును. వారి యంతట వారు లేచినప్పుడెకాని పాలీయరాదు.

సీత:—అక్కా! నీవన్నియు నెఱుఁగుదువు. నాకెంతయుఁ దోడు పడుచుంటివి. గుట్టువిడిచి నీ వృత్తాంత మేమియుఁ జెప్పవుగదా!

ఇంది:—చెప్పకేమి! చెప్పుట కేమున్నది!

సీత:—నీ వెప్పుడు నటులనే చెప్పుచుందువు.

ఇంది:—నా వృత్తాంతమువినిన నన్ను నీవు మన్నింపవు. పొమ్మందువు. ఈ చిన్నిబాలురవిడిచి నేఁ బోజాలను.

సీత:—అక్కా! చెప్పుము. భయమేల! అట్లు తలఁపకుము. చెప్పుము.

ఇంది:—నా భర్తయు నన్నుఁ బరిత్యజించెను. నాకు నొక బాలుఁడు కలఁడు.

సీత:—ఏఁడీ !

ఇంది:—తండ్రి తనకడనే యుంచుకొనెను.

సీత:—(కన్నీరుగార్చుచు నిదురించుచున్న బిడ్డలఁ జూపుచు) తండ్రిమో మెఱుఁగరుకదా !

ఇంది:— ఆశంబూకుఁడనువాని మాయకులోఁబడి మోహించిన పాపాత్మకురాలను నేనె. నీపతి బ్రతికించినది నాపుత్త్రునే. నా మూలముననే నీకీ వనవాసము సంభవించినది. తల్లీ ! (అని యేడ్చుచు సీతపాదములపైఁ బడును)

సీత:—అంతయు విధికృతము. లెమ్మ, ఏడువకుము. నాకు నీపైఁ గోపములేదు. అక్కా! ఊరకుండుము.

(అని లేవదీసి యిందిరనోదార్చును. పిల్లలాయలుకుడు విని లేతురు. సీత వారల నెత్తుకొనును.)

ఇంది:—ఇట్టిక్షమ, యీదయ మానవస్త్రీలయం దుండునా !

సీత:—మఱి, చిఱినెట్లు చొచ్చితివి !

ఇంది:—ఆ తంత్రరహస్యమెల్ల రావణసోదరి శూర్పణఖ వానికుపదేశించెను. అది నీపతినిఁ బరిణయమాడఁ గోరుచున్నదట ! ఎట్టి సాహసమో !

సీత:—అసంభవము. ఆర్యపుత్త్రుని నే నెఱుఁగుదును.

[ఒక యడవిచిలుకవచ్చి యఱటబ్రవాలును. బాలురుదానినిఁ జూపి కావలెనని సంజ్ఞచేయుదురు.]

సీత:—అదా!

ఇంది:—రామచిలుక - రామచిలుక.

బాలు:—లా - లామ - అమ్మా! లామ లామ (అని చేతితోఁ జూపి కావలెనందురు. సీతయు నిందిరయు దానినిఁ బట్టఁజూతురు)

(నేపథ్యమున)

"మానిషాద! ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్."

(అని వినఁబడును)

సీత:—ఎవరో జీవహింసవలదని శాసించుచున్నారు. ఆకొన్న నిషాదుఁడే నిషేధింపఁబడెను. వేడుకకై మన మీ చిలుకను బంధింపరాదు.

(సీత దానికొకఫలము నొసఁగును. చిలుక దాని ముక్కునఁ గఱచికొని యెగిరిపోవును.)

ఇంది:—నిజము నేనును బొరపడితిని, ఈ బాలకులయందలి మమకారముచేత.

సీత:—వయసువచ్చువఱకు నిటులపై వీరల నేనెటులఁ బెంచఁగలను!

బాల:—లామ - లామ - లామ. (అని యాకసము జూపుచుందురు)

(వాల్మీకి ప్రవేశము. సీత, యిందిర, లేచి నమస్కరింతురు.)

వాల్మీ:—అవ్యక్తాక్షరములతో మృదు మధురస్వరముతో నెవ్వరో బాలురిచ్చట రామనామ ముచ్చరించుచుండిరని చూడఁగోరివచ్చితిని.

ఇంది:—వీరు గో చక్రవర్తిపుత్త్రులు. ఈమెయే వీరితల్లి మహాసాధ్వీసీత.

వాల్మీ:—అహో ! కడుసుదినము. అమ్మా ! నేఁడు నాకు మిక్కిలి సుదినము. ఇప్పుడే సరస్వతీ కటాక్షమున నా జిహ్వ వేదముకంటె నితరమగు ఛందోబద్ధమగు వాక్యము నుచ్చరించినది. వెంటనే నాపూర్వపుణ్యఫల విశేషంబున శ్రీరామ పత్నీపుత్త్రుల సందర్శనభాగ్యము గలిగినది.

"వాల్మీకి తనజన్మంబు సఫలమగునటుల రామకథను - గావ్యముగ వ్రాయునుగాక" (యని వినఁబడును.)

వాల్మీ:—(బయులాలకించి) ఇది బ్రహ్మవాక్యము. భగవదను గ్రహమున నేనటులనే చేయుదును. తల్లీ ! మీరంద ఱును నాయాశ్రమమునకురండు. నేను మీకుఁ దండ్రి వంటి వాఁడను. ఈ పిల్లల కుచితరీతి నుపనయునాది సంస్కారములు గావించి క్షత్త్రియోచితంబులగు విద్యలనెల్ల నేరుపవలయు. కష్టములు శాశ్వతములు గావు. ముందు శుభములును గలుగవచ్చును. సంశ యింపకుఁడు.

సీత:—ఎంతకాలమునకు నాకిట్టి చలని మాటలు వినఁబడినవి. అక్కా ! ఇందిర ! మన మా పూజ్యులగు మహర్షుల యాజ్ఞచొప్పున నడచుకొందము.

[ఇందిరయు సీతయుఁ జెరియొకబాలుని నెత్తికొని వాల్మీకి వెనుక నడతురు.]

(తెరపడును.)

---

# తృతీయాంకము.

## మొదటిరంగము.

---

అయోధ్యలో రాజవీధి.

[ప్రవేశము జాంఘికుఁడు.]

జయం సీరామశక్కృవృత్తి వ్వారికి జయం. శత్తురుగ్గం ప్రబువు వ్వారు లవణాసుణ్ణి జయించి మదురాపట్టణంనుంచి తరిమేసి నారండోహోయి. కనుక యీవసంతోత్సవాలతో కలిపి యిజయోత్సవాల్కూడ జరు పాల్సిందండో హోయి. నగరమంతాయి జయపతాకాలెత్తాల్సింది. దీపసుంగారం సేయాల్సింది సంగీతసబలు పెట్టాల్సింది ఇంకా యెవరియానందం కొద్దీయారు యింతలు యినోదాలు సేయాల్సిందని శక్కృవృత్తిగారి చెలవయిందండో హోయి. జయం సీరామశక్కృవృత్తిగారికీ జయం. జయం జయం జయం.

(వెడలిపోవును. తెరపడును.)

---

## రెండవ రంగము.

### శ్రీరాముని దర్బారు.

ప్రవేశము శ్రీరాముఁడు, సుమంత్రుఁడు.

శ్రీ:—సుమంత్రా! నేఁడు రాజధాని యెల్లఁగళావిహీనమై తోఁచుచున్నది. పౌరులు నాయాజ్ఞగూడ మీరుచుండిరిగా. ఎచ్చటను నుత్సవకలకలము కానరాదు.

సుమం:—దేవ! ప్రభువువారి యాజ్ఞా తిరస్కారముకాదు ఇందులకుఁ గారణము. వేగులు రెండుకారణములను జెప్పుచుండిరి. మొదటిది దేవరయె చింతాక్రాంతులై యుండుటయఁట. రెండవది యందరినిబట్టి పీడించుచున్న క్షామమఁట.

శ్రీ:—ఆహా! తెలిసినది. అక్కటా! రాజునకు విచారించుటకైన స్వాతంత్ర్యము లేదుగద! అగును. నేనానందమునే యభినయింపవలె. వసిష్ఠభగవానుల నొక్క మారు దర్శింపవలయు.

సుమం:—ఏలినవారు సిద్ధసంకల్పులు. వారు గోగురువుగారు దయచేయుచున్నారు.

[ఇరువురును లేచి కొన్ని యడుగులు ముందునకు నడతురు. వసిష్ఠుఁడు ప్రవేశించును.]

వసి:—(నమస్కృతుఁడై) మనోరథము సిద్ధించుఁగాక.

శ్రీ:—గురూత్తమా! చూచుచుంటిరిగదా! ఎట్టి విరీతపు కఱవీదేశము నాక్రమించుచున్నదో! ఆకారణమునఁ బ్రజలెట్లు పలుబాములఁ పాలగుచుండిరో! ఇట్టి స్థితి

యందు తరణోపాయ మెద్దియేని గలదేనినానతీయ వలయు.

వసి:—వత్స! నీ వశ్వమేధయాగ మొనరింపుము. ఈ దుర్ని మిత్తము లెల్లఁదొలఁగిపోవును. మఱియు నట్టి మహా క్రతువు సంకల్పించి నిర్విఘ్నముగఁ గొనసాగించుటకుఁ గూడ నీవు సమర్థుఁడవు.

శ్రీ:—గురువుగారి యాశీర్వచన ప్రభావంబున నే నటులనే సేయుదును.

[లక్ష్మణ భరతశత్రుఘ్నులును గొందఱు సామంత సైన్యాధ్యక్షులును ప్రవేశము.]

భర:—కోటముందు లంకాపురి కాల్పించితిమి. సరయువు నందు పడవ పోటీలు జరిపి బహుమానముల నిచ్చి తిమి. మైదానమునందు బీదల కశేషముగ సంతర్పణ జరిగినది. విజయోత్సవ కార్యక్రమ పట్టికను బూర్తి చేసితిమి. కాని ప్రజలుగూడ నుత్సాహముతోఁ బాల్గొనకుండిన నుత్సవములెల్ల వెలవెలఁ బోవుచుఁ గృత్రిమములైనటులఁ బొడకట్టును.

శ్రీ:—సరియే. మన గురువుగారు వసిష్ఠ భగవానులాదేశిం చిరి యీ దోషనివృత్త్యర్థ మశ్వమేధ యాగము గావింపుమని. నేనందుల కియ్యకొంటిని. ఆ మహా యాగముగావించుటకు నిశ్చయించితిని. అందునకు వలయు సాధన సామగ్రి యెట్టిదోకూడ నేనడుగలేదు.

శత్రు:—ఎట్టిదైననేమి! భగవానులాజ్ఞాపింతురు. మేము సమ కూర్తుము.

సుమం:—ఏలినవారి సంకల్పమాత్రముననె సర్వకార్యములు సిద్ధించును.

వసి:—మీరందఱుగూడ నిటుల నామోదించుట మిగులశుభావహము. కార్య సుముఖత్వమును సూచించుచున్నది. ముందొక యశ్వము కావలెను. వెన్నెలవంటి దేహము. చెవులు మాత్రము నీలము,మగది, బాడబనుగూడనిది. అయియుండ వలయును.

లక్ష్మ:—కలదు. స్వర్గమునుండి యింద్రజిత్తు తెచ్చెనని చెప్పుచునన్నగారికి లంకాపతి విభీషణుడు సమర్పించుకొనిన యశ్వరాజమున కిన్ని లక్షణములును గలవు.

వసి:—చతుస్సాగరవలయిత భూచక్రంబున శ్రీరామచక్రవర్తిని బ్రతిఘటించి నిలుచు వీరుఁడొక్కఁడును లేకుండవలయు.

భర:—అట్టివారు లేనేలేరు.

వసి:—ఏతత్ప్రకటనార్థము యాగాశ్వమేక వత్సరపర్యంతము యథేచ్ఛగ నిరాఘాటముగ భూమండలంబున సంచరించిరావలయు. అట్టిదాని నెవ్వరేని బంధించినచో వారల జయించి శ్రీరామసైన్యములా యశ్వమును విడిపించుచుండ వలయును.

శ్రీ:—తమ్ముఁడా! లక్ష్మణా! ఆభారమెల్ల చిరంజీవి మన చంద్రకేతువు వహించి నిర్వహించుచుండ నాకుఁ జూడవలయునని యున్నది.

లక్ష్మ:—అంతకంటెఁ గోరఁదగిన దేమున్నది.

సుమం:—తండ్రులు పైగనుండి కొడుకులు కార్యముఁ జక్కఁ బెట్ట జూచుచుండుటకంటె నానందముకలదా!

శ్రీ:—(కన్నులు మూసికొని నిట్టూర్పువిడిచి) నిజము. సుమంత్రా! నీవె వానికి సారథివై స్వయముగ రథము నడపుచు నన్నివిధములఁ గనిపెట్టుచుండ వలయును.

సుమం:—సారథ్యము నాకుఁ బ్రసాదింపుఁడని నేఁ గోరవలయు ననుకొనుచుంటిని.

వసి:—మఱియు బంధుమిత్రులనెల్ల నాహ్వానింపవలయు.

శ్రీ:—ఋషిమండలి నెల్ల భరతుఁడు స్వయముగ నాహ్వానించును.

భర:—ఈసారి యన్నగారి యాజ్ఞ నాకు మహాత్ముల సందర్శన సంభాషణ భాగ్యమును గలిగించుచున్నది.

శ్రీ:—నా ప్రియసఖుఁడు విభీషణుఁడు, సోదరతుల్యుఁడు సుగ్రీవుఁడు శత్రుఘ్నునిచేఁ బిలువఁబడి గౌరవింపఁబడుదురు గాక. హనుమంతునితో రమ్మని నామాటగఁ బ్రత్యేకముగఁ జెప్పవలయునుమా.

శత్రు:—అట్లే.

శ్రీ:—లక్ష్మణా! తక్కఁగల స్వదేశ విదేశ సామంతరాజలోకంబునకెల్లఁ దగువారలచే నాహ్వాన పత్రముల నందఁజేయుము.

లక్ష్మ:—అటులనే చేసెదను.

శ్రీ:—తరువాత నీవు చంద్రద్వీపమున కరిగి - మామ గారిని సందర్శించి.

[వసిష్ఠునిఁజూచుచుఁ దలవంచుకొని యూరకుండును.]

వసి:—వారికి భక్తితో నమస్కరించి "వసిష్ఠుఁడు శ్రీరామునిచే నశ్వమేధము చేయించుచున్నాఁడు. అనూంగళ్యహారం బునఖిల శుభదాయకంబునునగు నాయాగము మీరు తప్పక దయచేయఁదగినది అని నా మాటగఁజెప్పుము.

లక్ష్మ:—చిత్తము.

శ్రీ:—మఱియు నీయాగ మమ్మగారెచటనుండిరో యచటనే యా యరణ్యమందే జరుగవలయు.

వసి:—రామచంద్ర! లెస్సయగు మాటఁ బల్కితివి.

సుమం:—మహారాజుగారి సెలవైనచో నావనమందె మఱి యొక యయోధ్య యుద్భవించును.

వసి:—శ్రద్ధగా విని బాగుగ నాలోచించుకొనవలసిన మఱి యొక ముఖ్యాంశముకూడఁ గలదు. అపత్నీకునకు యజ్ఞాధికారము లేదుగద. కావున, వత్స! రామ చంద్ర! నీవు ధర్మపత్నీ స్వీకారము సేయవలయు.

(సభయంతయు నిశ్శబ్దమగును.)

శ్రీ:—గుర్వాజ్ఞ (సభయంతయు సబాష్పము దీర్ఘోచ్ఛ్వాస నిశ్వాస సంకలితమునగును.)

శ్రీ:—మీరెల్లరు మీ మీ పనులయందుండుఁడు. నేటికి సభ చాలింతము.

(అందఱు రిచ్చవడి చూచుచుందురు)

(తె ర ప డు ను.)

## మూఁడవరంగము.

### సీత యుద్యానవనము

[సవిచారముగ శ్రీరాముఁడు ప్రవేశము.]

శ్రీ:—ఎంత కళావిహీనమై యున్నది! విజ్ఞానములేని సౌందర్యమువలె నిస్సారమై యెంత వెలితిగఁ దోఁచుచున్నది! ఆ పున్నమనాటి రాత్రి! - కన్నులఁగట్టి నట్లున్నది! ఈ జాజిపొదముంగిటనే రాజశబ్దము నెంత సరసముగఁ జమత్కరించినది! రసభావ శూన్యమగు నిర్జీవ హృదయగహ్వరమువలె నిందిప్పుడొక యాకారము మాత్రమె మిగిలియున్నది. (జాజిపొదను జూపును. ముందునకుఁజూచి (శ్రవణమభినయించుచు) మఱచిపోవు గద! ఈ పెంపుడు చిల్కలు! ఆ ప్రేమంపుఁ బలుకుల తోడనే నన్ను బలుకరించుచున్నవి! (ముందునకునడిచి) ఇదిగో! ఆమె పెంపుడులేడి రెండు పిల్లలను బెట్టినది!- నాపంక నెంతదీనముగఁ జూచుచున్నది! (ముందునకు నడిచి) ఇచట - ఈ సొగటాలపాళి నిటులనే దిగవిడిచెను! ముగ్ధ! బాల! కేళిలోల! హా! - బయలుదేరినది ఇక్కడినుండియే కావలయు! నేనిచ్చటనే కూర్చుండెద. అదిగో నాప్రియ చిత్రలేఖిని. పటముపై నటులనే పడియున్నది. ఏరూపంబుననైన, ప్రేమ, భక్తి, దయ, వీనినే చిత్రించుచుండును (చిత్రపటము సమీాపించి చూచి) హా! హా! హా! ఎంతఘోరము! ఎంత ఘోరము! ఏమి చూచుచుంటిని! నాకన్నులయెదుట!

ఇది స్వప్నముగాదు. ఇంద్రజాలమా! రాక్షసమాయయా! కాదేని రాదేల మహాప్రళయము! త్రినేత్రుని ఫాలాక్షమింకను మూతవడియే యున్నదేల! ధర్మము ధర్మమునందు మునిఁగిపోయెనా! సృష్టియు సత్యముపై నాధారపడియున్నదా! నేను రాముఁడను గానా! ఆమె సీతకాదా! కట్టా నాకు దిగ్భ్రమ కలుగుచున్నది! (మాౖన్పడి నిలిచి తిరిగి నల్దిక్కులఁ గలయఁ జూచి) "పరిశీలింపుము. పరిశీలింపుము! ఎందుండి యీదివ్య నాదము! నాయంతరాత్మయె యిట్లు ద్బోధించుచున్నది! - ఔను. జ్ఞప్తియున్నది. నాఁడు మాలిని ప్రసంగించినది దీనిని గూర్చియే. అట్టిదియే యైనచో గోప్యముగానుండదా! ఇంతబహిరంగముగ దిగవిడచునా!(పటముదీసి పరిశీలించుచు) నేఁడు జాలికిఁ బాత్రమిది! నిజను. దేవీ! నిజము! ఆహా! విశ్వ ప్రేమ సాకారమైనది గద నేఁడు నీయందు! అహాఁ! నేఁడు జాలికిఁ బాత్రమిది!" అజ్ఞానాంధకారంబుచే రాగ ద్వేషంబులంబడి కొట్టులాడుకొను లోకమునకీ నవాక్షరమాల నవ్యనక్షత్రమాలయై నిజభావ ప్రకాశమున మార్గదర్శకమగుచు శాశ్వతముగ మానసగగన వీధిని విరాజిల్లుగాక! - అక్కటా నేడు అట్టి సీతను విడనాడి యీరామునకు రెండవ పెండ్లియా! (పైనుండి శూర్పణఖ యచ్చరరూపమున రాముని వెనుకనుండి భూమికి దిగి మాటున కరుగును) మానెదను. నేనశ్వమేధము మానెదను.

శూర్ప:—వలదు ! రాఘవా ! మానవలదు.

[రాముఁడు తటాలున వెనుదిరిగి]

(స్వగతము) అశరీరవాణి పల్కుచున్నది. (ప్రకాశము) ఏల !

శూర్ప:—మానవేంద్ర ! దేవేంద్రాదులు నీ యశ్వమేధము కొఱకెదురు చూచుచుండిరి.

శ్రీ:—నా కశ్వమేధము విధి కాదు.

శూర్ప:—కావచ్చును. కాని రామచంద్ర ! నీ సంకల్పమునకు విఘాతము తగదు.

శ్రీ:—తగదో, తగునో ! మొదటనాకా యజ్ఞాధికారము లేదు. మీరలెవ్వరో దివ్యులు కావలయును. నాక గోచరులై యుంటిరి. కంఠము మాత్రమె వినవచ్చుచున్నది ! నన్ను నను గ్రహింపఁదలచితిరేని నాకు దర్శన భాగ్యము గూడఁ గలుగఁజేయుఁడని వేఁడుచున్నాను.

(శూర్పణఖ తటాలున ముందునకువచ్చి)

ఆర్యపుత్త్రునకు నమస్కారము.

శ్రీ:—(నేలవైపు తిరిగిచూచుచు) అమ్మ ! మీరెవ్వరు !

శూర్ప:—రాజేంద్ర ! ఆ సంబోధనముచితము కాదు. నేను బ్రహ్మమానస పుత్త్రిని. భూలోకాధి పతియగు శ్రీ రామ సార్వభౌముని యశ్వమేధ యాగాధికార సిద్ధి కొఱకు దేవతలెల్ల కోరుటచే నాతండ్రి నన్ను సృజించెనఁట ! వెంటనే నన్నిటకుఁబంపివేసెను !

శ్రీ:—ఔఁగాక. నాకవాసుల వాత్సల్యాతిశయంబునకు, నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. త్రిదశులు సదా పూజ్యులు.

వందనీయులు. నీతండ్రి చతుర్ముఖుడును నాచిత్త వృత్తి నెఱింగియే యుండును అయినను నన్నుఁ బరీక్షించుకొఱకె నిన్నంపియుండు నని తలంతును.

శూర్ప:—(సిగ్గును నిరాశయు నభినయించుచు నధోముఖియై) ఈ యబలయే పరీక్షింపఁబడుచున్నది !

శ్రీ:—ఐనచో నీరామున కొక్కటియే హృదయము. అది సీతా పరమైనది, అని ఇప్పుడు ముల్లోకము తెలియుఁగు గాక.

శూర్ప:—ఇక నాజన్మము వ్యర్థముఁ జేసెదవా !

శ్రీ:—అది యీనరుఁడు సమాధానము చెప్పఁ దగినది కాదు.

శూర్ప:—నా బ్రహ్మతోఁ జెప్పి కొనుమని మొదవు గాదా ! రామా ! ఇటు చూడుము. నేను శూర్పణఖను. నీవు నాయన్నను జయించితివి ! కాని పురుషునకుఁ బురుషుని జయించుట ఘనత కాదు. నీప్రేమఁ గోరివచ్చుట నా పొరపాటు. స్త్రీ శక్తి విజృంభించుచున్నది. గురు తెలిఁగి కాచుకొనుము! (వెడలిపోవును)

శ్రీ:—(నిర్లక్ష్యముగఁ దలపంకించి చూచుచు మందహాసము చేయుచు) మహానాటకములో నిదియొక్క యంత ర్నాటకము — నాయాగము విఘ్నము సేయఁబోవును కాఁబోలు. నేనశ్వమేధమునే మానివేయ నిశ్చయించితి గాదా ! అట్లయిన నారాజ్యమున దుర్భిక్షము తొలఁ గుటెట్లు ! ఇంతకు మున్నెన్నఁడును లేదే రాముఁడిట్లు సంకల్ప వికల్పముల నడుమ నుయ్యాలలూగుట! హా! ఎట్టి యవస్థకులోనగు చుంటిని! నాస్థిరబుద్ధియు నన్నుఁ

శాసించనెను. నే నిప్పుడేమి సేయుదును ! అశ్వమేధ మెట్లుచేయుదును! సీతా! (నిశ్చేష్టుఁడై బిగ్గరగఁ బిలుచును. బయులు తదేకదృష్టిగఁ జూచుచుండును. రామునకు సీతరూపమంతరాళమున గోచరించును) నేత్ర సాఫల్యము ! హృదయానందము అర్ధాంగిరూపము. చంద్రరేఖా సదృశము ! మన్మనో హృదయాంధకారనాశకము. అదిగో ప్రత్యక్షము. సంపూర్ణమగుచున్నది. విద్యుల్లత నిశ్చలమై నిలిచియున్నది. కిరణ ప్రసాదమునఁ గాంతిమండల మేర్పడుచున్నది! ఒకయాకృతి తేలుచున్నది! సింహళ పద్మమండము నుండి యుద్భవించుచున్నది. అహో! తలకట్టువీడి - దక్షిణాంసము పైఁబడి హిమవన్నగ మగుచున్నది. ప్రఫుల్లవదన సీమ సుందరకాశ్మీరమై కానఁబడియెడి. పాలిండ్ల మధురములగు గంగాయమునలు ప్రవహించుట గోచరించుచున్నది. ఒడ్డాణము వింధ్యము. తపతీనర్మదలు మొలనూలు. గాత్రము సస్యశ్యామలము. అహో ! ఇదియే నారాజ్యలక్ష్మి. చంద్రికనడుమ చంద్రునివలె నదిగో సీత ప్రకాశించుచున్నది. (వసిష్ఠుఁడు ప్రవేశము) ఏకపదార్థము. స్థూలసూక్ష్మ మాత్ర రూపభేదము. విశ్వరూపము సంక్షిప్తమగుచున్నది. సన్నని మెరుపుదీగవలె సీతయదిగో వంగి నమస్కరించుచు - మబ్బు చాటయ్యెను.

(రెప్పలనప్పళించుచు బాహ్యలోకముఁ గాంచి వసిష్ఠునకు నమస్కరించును.)

వసి:—శుభమగు గాక.

శ్రీ:—ఈ రాత్రివేళ దయచేసితిరి.

వసి:—ఇప్పుడే సంధ్యముగిసి చీకటి పడినది. ధర్మపత్నీ స్వీకార విషయమై నీవేమి నిశ్చయించు కొంటివో తెలిసికొనఁ గోరి - నీ విప్పుడేమి చేయుచుంటివి!

శ్రీ:—ఆవిషయమున శాంతముగ నిటఁగూర్చుండి నిర్ణయించు కొనఁగోరి వచ్చితిని.

వసి:—తుదికేమి నిశ్చయించితివి?

శ్రీ:—సీతయె నారాజ్యలక్ష్మి. ఏకపదార్థము సంక్షేపవిక్షేప శక్తులచే నీరెండు రూపములఁ దాల్చినది. ఆ రెంటికిని దీపమునకును వెలుగునకునుఁ గలసంబంధము గలదు.

వసి:—ఎవరు కాదనిరి!

శ్రీ:—నాయజ్ఞానమె. ఇంతవఱకు రాజమానవ ధర్మములకు సామరస్యముకుదురక నామన సెంతయో క్షోభించెను. గురుజన సమ్మతమేని సువర్ణ సీతను బెట్టుకొని నే నశ్వ మేధ మాచరింతును.

వసి:—అదిగురు జనసమ్మతమే కాదు. ముల్లోకములుఁ గొని యాడునది. శ్రీరామునకుఁ దగియున్నది.

(తె ర ప డు ను.)

# చతుర్థాంకము.

## మొదటిరంగము.

---

కొండగుహ - లవణాసురుఁడు. శూర్పణఖ ప్రవేశము.

లవణ:—ఏమిచేయుదును ? నా బలములన్నియుఁ జెల్లాచెదరై పోయెను. చాలభాగము నశించెను. ముఖ్యులగు వీర సైన్యాధ్యక్షులతో నేనుమాత్ర మెటులనో బ్రతికి మధురనుండి యెగిరి యీ గుహాయందుఁ బడితిని.

శూర్ప:—పోనిమ్ము. ఇప్పటికి రామునితో సంధిచేసికొనవలె నని యున్నదా !

లవణ:—కులద్రోహి విభీషణుఁ డొక్కఁడే రాక్షసవంశము చెడఁ బుట్టినాఁడు. మూతిపై మీసముగలిగి వీరుఁడన్న రాక్షసుఁ డెవ్వఁడైనను ఈగీమునితో సంధియని తల పెట్టుట కడునీచము, హేయము. విభీషణుని సోదరివి. నీవొకవేళ సంధికుదుర్చుటకు వచ్చితివా యేమి !

శూర్ప:—చక్కఁగాఁ గనిపెట్టితివి ! నేను రావణునకును సోదరినేయగుదును. నీవిజృంభణము విని సంతసించితిని. పరాజయము విని దుఃఖించితిని. ఇప్పుడు నీయుద్యోగ సన్నాహము లెట్లుండెనో చూచి పోవలయునని వచ్చితిని.

లవణ:—సత్కాలముకొఱకు నిరీక్షించు చుంటిని. ఇప్పుడు లంకాధిపతియే సైన్యసమేతుఁడై యీ రాముని

యాగము నిర్విఘ్నముగ సంరక్షింప దయచేయుచుండె నఁట సిగ్గులేక. ఇది తనజాతికంతకును( దలవంపుకాదా!

శూర్ప:—అవును నిజము. అయినను చేయఁగలదేమి!

లవణ:—అదియే శోచనీయము. శోచనీయమదియే. ఆయశ్వ మును హరించి మాయము సేయుదునా! అప్పుడశ్వమే యుండదుగదా!

శూర్ప:—నిజమే. కాని మాయలఁబన్ను నేర్పిప్పుడు చెల్లదు. ఇంద్రజిత్తును సంహరించిన లక్ష్మణుఁ డందుఁగలఁడు. మఱియు మన మాయామర్మములగుట్టెల్ల నెఱిఁగిన నాయన్నయు మన దురదృష్టవశమున వారిపక్షమునే వహించి యుండెనుగదా! అయినను నా బుద్ధికొక యుపాయము తట్టుచున్నది. ఆడుదానను నే పొరబడనే వచ్చును. మీరును నేఁజెప్పినదివిని కర్తవ్యమాలోచించి నిశ్చయించుకొనుఁడు.

లవణ:—అవశ్యము మాకు హితముపదేశింపఁ దగినదానవు. శుక్రాచార్యుని ప్రియ శిష్యురాలవు. నీబుద్ధి పొర బడునా! రావణ సోదరి యెట్లాజ్ఞాపించిన మేమందఱ మట్లు నడతుము.

శూర్ప:—నీ వెన్నఁడు నా యండఁబాయనని బాసచేయవల యును. నే నెఱింగించు రహస్యముల నెన్నఁడును బయ ల్పఱుపరాదు.

లవణ:—రాఘవరక్తపిపాసాపీడితమగు నాకర వాలమును ముట్టి శపథముఁ జేయుచున్నాను. వినుము. నాకంఠమునఁ బ్రాణమున్నంతవఱకు నేను శూర్పణఖకు బాసటనై

నిలుతును, ఆమెయాజ్ఞకు రావణాజ్ఞకువలె విధేయుఁడనై సంచరించెదను. నీవు చెప్పు రహస్యముల హృదయమునందు పూడ్చిపెట్టెద.

శూర్ప:- రాముని కిరువురుపుత్త్రులు గలరు. ఎఱుఁగవా!

లవణ:- సీతను నిండుచూలాలిని లక్ష్మణుఁడు నట్టడవినిడిచి పోయెనని వింటిని. పిదప చూచుటకూడ సంభవించినది. చక్కని ప్రాయశ్చిత్తమాయెనని సంతసించితిని.

శూర్ప:- అవును ఇప్పుడామె వాల్మీకి యాశ్రమమునందున్నదఁట. ఆతెఱఁగు స్వామి ఎవ్వరు నెఱుఁగరు. ఆమె కిరువురు పుత్త్రులు కవలు కలిగిరఁట. వారికా తెల్లగడ్డపుటాయన కుశలవులని పేళ్లుపెట్టెనఁట.

లవణ:- (ఆశ్చర్యముతో) ఏమి! కుశలవులా! కుశలవులు రాముని పుత్త్రులా! మేము వారిని తఱచు చూచుచునే యుందుము. ఏపులినో తఱుముకొనుచు నాశ్రాంతమునకు వచ్చుచునే యుందురు. ఈమాఱు కంటఁబడఁగనే వారిని మొదలిఱచి తుదముట్టించెద. ఈలోకము రాఘవశూన్యము కావలయును.

శూర్ప:- నేను చెప్పునది కాదు. మనము వారితో స్నేహము చేసుకొనవలయును. వారివలన మనము కార్యము సాధించుకొనవలెను

లవణ:- (ఆలోచించి) అదియు మంచి యాలోచనమే. శత్రుని వేఱుచేసి కదా రాముఁడు అన్నను చంపఁగలిగినాఁడు.

శూర్ప:- వారిని పురికొల్పి యాగాశ్వమును వారుపట్టి బంధించులాగునఁ జేయవలయు.

లవణ:—బాగున్నది - కన్నకొడుకులను జేతులారఁ జంపుకొనును వెఱ్ఱిరాముఁడు.

శూర్ప:—వారలటుల తేలికగాఁ జచ్చువారలుకారు. వారికడ జృంభకాస్త్రములున్నవఁట. బ్రహ్మాస్త్రమును మించినవఁట. ఎటులు వచ్చెనో తెలియదు. ఉన్నమాటనిజము. వీరు పెఱిగి పెద్దవారయినచోఁ దండ్రిని మించి చెలరేగుదురు. కావున నిప్పుడే తండ్రి కొడుకులకుఁ గయ్యము గల్పించితిమా యెవరు నెగ్గినను, ఎవరోడినను మనకు శ్రేయము గలదు. మనము మాటుననుండి కుఱ్ఱలకుఁ దోడ్పడి హెచ్చరించుచుంటిమా యీపోరొకపట్టునఁ జల్లారదు. అశ్వమేధమా అడ్డిపోవచ్చును. రామసైన్యములాచాలవఱకు నశించును. అప్పుడు మనమనాయాసముగ నయోధ్యనే యాక్రమించుకొనఁగలము.

లవణ:—రామునిరక్తముతో రావణకాష్టమారఁగలదు.

శూర్ప:—మఱి నీవీ ప్రయత్నమందుండుము.

లవణ:—ఇప్పుడేపోయి కుశలవులతో మైత్రినెఱపు రాక్షస బాలురఁగూర్చి నియోగించెద.

శూర్ప:—అదియే కార్యము పోయిరమ్ము. (లవణుఁడు వెడలిపోవును.)

శూర్ప:—ఈ క్రోధానలము ప్రేమమారుత ప్రజ్వలితము. భీకరజ్వాలారూపమేగాని సహజంబగు వేడిమి బయల్వెడలకున్నది. అక్కటా! నీమోహనరూపమ్మునకు నేముగ్ధనై కట్టువడితినిగదా! - రామా! నాజీవితము కేవలము కృత్రిమమయి పోయినది. ఇక నాకెందును

ఏమిచేయుచున్నను ఆనందము లేదు. మనస్సునకు తృప్తి లేదు. హృదయమునకు శాంతి లేదు. అయినను నీపై పగసాధింతును. ప్రతినఁబూనితినిగావున పగసాధింతును. (వెడలిపోవును.)

(తెర పడును).

---

## రెండవరంగము.

### వాల్మీకి యాశ్రమము.

(ముంగిట సీత కూర్చుండి ఋషిబాలకులతో మాటలాడుచుండును.)

1. ఋ-బా:—పులిపిల్లలను చంకనిడికొని కడువేగమున బరుగెత్తుచుండిరి. వెనుక పులి తఱుముకొని పోవుచున్నది.

సీత:—అక్కటా! నేనేమి చేయుదును.

2. ఋ-బా:—అంత కుశుఁడు వెనుదిరిగి యాడుపులి నెదుర్కొని నిలుపఁజొచ్చెను. లవుఁడు పులిపిల్లతో ముందునకుఁ బరుగిడిపోవుచుండెను.

సీత:—అయ్యో! ఏమి దుండగము! గురువులైన నిచటలేరే మందలించుటకు!

3. ఋ-బా:—పులి గ్రుడ్లెఱ్ఱజేసి నోరు తెఱచి గాండ్రించుచు

సీత:—హా! కుమారా! నీకేలరాయిది!

1. ఋ-బా:—అమ్మా! చాల చిత్రము జరిగినది. వినుము. వాని యుపాయము. సాహసము! చేతనున్న దండమునకుఁ బైయుత్తరీయముఁజుట్టి దానినోటి కందిచ్చెను. అదియే చేయియనుకొని దానిని కోరలతోఁబట్టి చీల్చఁ

బోవుచుండ కట్టినింకను లోనికిఁబోనిచ్చి గొంతుకలోఁ గట్టిగఁ బొడువఁజొచ్చెను. పోట్లు తినుచు మఱింత రోషముతో బొబ్బరించుచుఁ బైకి దుముకఁ నుఁకించు చుండఁ దటాలున నిరువురు రాక్షసబాలురువచ్చి దానిని వెనుకనుండి తోకలాగిపట్టుకొనిరి. తోడనే పులి వెను దిరిగి వారినిఁ గబళింపఁబోవ మన కుశుఁడు చెంగున దానినడుముపై కురికి ముష్టిఘాతములచే దానిశిరము వ్రయ్యలు సేయుచుండెను. అపుడాసమరము - ఆ లాఘవము - ఆసాహసము - ధైర్యము - శౌర్యము - మాకానందము నాశ్చర్యమును భయమును గొలుపఁ జొచ్చెను. ఎట్టకేలకాముగ్వురు బాలురనడుమ నాపులి పడి చచ్చిపోయెను. ఇంతలో లవుఁడు పులిపిల్ల నెచ్చటనో భద్రముగదాచి యున్నకుఁ దోడుపడఁ బరుగు పరుగున వచ్చెను. అంతట మేమును చెట్టుదిగి వారల సమీపించి తిమి.

సీత:—బాగుగనేయున్నది. అల్లరి యెక్కువ యగుచున్నది.

2. ఋ-బా:—అప్పుడు వారు నలువురునుగలిసి మమ్ముఁజూచి నవ్వుచు, కేరుచు, నాడుచుఁ బాడుచు పులిపిల్లను దాచి యుంచినచోటికిఁ బోవుచుండిరి. అంతలోనే రాక్షస బాలురు చెలికాండ్రయిరి-మేము వెరవార మయితిమి.

సీత:—(మందహాసముతో) అట్లనఁబోకుఁడు. మీరందఱు నొక పల్లెవారు. ఒకజాతివారు. ఒకఁచోఁజదువు కొనువారు. (కుశలవులు పులిపిల్లను చంకనిడికొని ముద్దులాడుచుఁ బ్రవేశించి సీతకు నమస్కరింతురు)

సీత:—(స్వగతము) ఇప్పుడు గదా నామనసు కుదుటఁబడినది. హృదయము శాంతమగుచున్నది.

కుశు:—అమ్మా ! మాటాడవేమి ! మావంకఁ జూడవేమి ! అడవులఁ దడవాగితిమని కోపమా !

లవు:—ఇదిగో! దీనిమూలమున నాలస్యమయినది. చూడుము. ఎంత చక్కఁగ నున్నదో ! అందముగఁ బరుగెత్తును - దుముకును మొగ్గలువేయును - ఇచటి లేడిపిల్లలకంటె.

సీత:—నాకు భయమగుచున్నది. దానిని విడిచివేయుఁడు.

కుశు:—ఏమిభయము ! భయమన నెట్లుండును ! పులిపిల్లను జూచి యెవరైన భయపడుదురా !

లవు:—ఈ మువ్వన్నెఁజూడ ముచ్చటగుటలేదా !

ఋ-బా:—పులులను, సింహములను, రాజులు విహారవనంబుల వినోదమందిరంబులఁ బెంచుదురు, కాని యవి మన ఋషివాటికలయం దుండఁదగినవి కావు.

కుశు:—ఏల! ఆచర్మముల మనము.

ఋ-బా:—మీతో మేము వాదింపము. గురువుగారు వచ్చిన వెనుక వారే చెప్పఁగలరు. అమ్మా! సెలవు. (నిష్క్రమింతురు).

సీత:—పోనిండు నేనొకమాటఁ జెప్పెదను. చెప్పుడు. పాపము ఇది యింకను పసిపిల్లకదా! తల్లిపాలు ద్రాగువయసు. దీనిని తల్లికడనుండి వేరుచేసి తెచ్చితిరే! పాపమది బెంగపెట్టుకొని యేడువదా! దాని తల్లిపాలు దానికిపు డెట్లువచ్చును! ఇటులచేయుట మంచిపనియా!

లవు:—మంచి యావుపాలుపోసిన త్రాగదా!

కుశు:—[ తాఁగదు. తప్పుచేసితిమి. ఇపుడు తెలిసినది. అమ్మా! మేమిప్పుడేమి చేయవలెను !

సీత:—వదలివేయుడు. స్వేచ్ఛగ దాని నిచ్చవచ్చిన చోటికిఁ బోనిండు.

లవు:—మఱి దానితల్లి చంపివేయఁబడెను గదా! మనము వదలి వేసిన దానినిగాపాడి యెవరు పెంచుదురు మనయొద్ద నుండిన.

సీత:—అటులకాదు. మనలనందఱఁ బెంచి కాపాడుచున్న యాదేవుఁడే దానినిబెంచి కాపాడును.

లవు:—తాతయ్య యెన్నఁడును మాకింత బాగుగఁ జెప్పలేదు. నీవు చెప్పినట్లు నడచుకొందుము.

(పులిపిల్లను వదలివేయుదురు).

సీత:—ఆడుపులి. పిల్లలతల్లి. దానినేల చంపితిరి! ఒక జీవుని నిష్కారణము వేఁడుకకై చంపుట పాపమని కరుణా స్వరూపుఁడగు నా వాల్మీకి మహర్షి మీకు బోధించి యుండలేదా! ఆమాటమఱచితిరా !

కుశు:—లేదు. తమ్ముఁడు శాబకముతో ముందు పరుగిడు చుండెను. వెనుకనుండి తఱుముకొని వచ్చు పులి నాపఁ దలచితిని. కాని చంపవలదనియే మొదట ననుకొం టిని. కాని నాకు సాయము చేయవచ్చిన యిరువురు బాలురపైఁబడి యదికబళింపఁ బోవనప్పుడు దానిని జంపితిని వారల రక్షించుటకు.

సీత:—ఆబాలురెవరు!

కుశు:—దానవకుమారులు.

సీత:—సరియేకాని మీరు రాక్షసులతో మాత్రము సెలిమి సేయుట యెన్నఁడును దగదు. వారు మనకు స్నేహపాత్రులుకారు. మీకిచ్చట నెందరో ఋషి బాలకు లుండఁగ నాడుకొనుటకు రాక్షస బాలురతో మీకేమి యవసరము.

లవు:—మన యీ ఋషిబాలురు పట్టి పిరికివారు. ఏమిచేయుద మన్నను వెనుదీయుదురు. మాతో సరిగాఁ గలిసిరారు.

కుశు:— వారు దేవతలతో సమానులఁట. వారికంటెను జ్యేష్ఠులఁట. అయినను దేవతలు పాపము వారిని మోసపుచ్చి యనేకకష్టనష్టముల పాలుచేసిరఁట-వారే చెప్పియున్నారు.

సీత:—అగును. కాని వేదముల నపహరించిన సోమకాసురుఁడు, మన భూమినెల్లను జాపగాఁ జుట్టిన హిరణ్యాక్షుఁడు మొదలగువారెల్ల వీరి వంశములోనివారే. నేను వారిని ద్వేషింపుఁడని చెప్పను. మన మట్టివారికి దూరముగ నుండుటమంచిది.

కుశ-లవు:—అమ్మా ! అటులనేయుందుము.

సీత:—గురువుగారు వచ్చునప్పటికి మీరు పాఠములన్నియుఁ జదువుకొని సిద్ధముగనున్నచో వారు మిక్కిలి యానందింతురు. మిమ్ము నెక్కువగఁ బ్రేమింతురు. కావున,

కుశు:—రామాయణము గానముచేయుట మాకుపాఠమువలె దోఁచుటయే లేదు. మా వీణలు తెచ్చుకొని పాడుదుము. నీవుకూడ వినుము. అట్టి యందమైన కథ అంత సొగసైన పాట నీవెప్పుడును వినియుండవు.

లవు:—అమ్మా! ఏమి యోచించుచుంటివి!
సీత:-ఏమియును లేదు! వలదు పొండు శ్రద్ధగఁ జదువుకొనుఁడు.
(కుశలవులు తల్లికి నమస్కరించి వెడలిపోవుదురు).
సీత:—ఆహా! ఆహా! కాలమెంత నిర్దయమయి ముందున కూరక జరిగిపోవుచున్నది! ఈ మహా ప్రవాహముపై నెచ్చటి వారచ్చటనేయుండ ముందునకుఁ గొంపోఁబడు చుండిరి. ఒండొరుల సమీపించుట, కలసికొనుట కలుగ నేరదు. ఈ యుదయాస్తమయములు నాకు వినుగు గొలుపుచున్నవి. నాబిడుల లెప్పటికి నిటులనే యుం దురుకాబోలు. తండ్రి మొగమెఱుఁగక, యడవులలో దిరుగుచు, మృగములతో నాడుచు కందమూలములఁ దినుచు, వల్కలములఁ దాల్చుచు, - కటకటా! రఘు వంశధురంధరుని పుత్రుల కెట్టిపై భవము! ఇది నేను చూడఁజాల. ప్రాణముల భరింపఁజాల. జీవము దుస్స హము. దుర్భరము. అయినను తప్పదుగద. ఏకారణ మున నాఁడీ ప్రాణముల విడువక బలవంతముగ నిర్భాగ్య మగు నీదేహమునందు నిలిపియుంచితినో యాకారణముననే యింకను గొంతకాలము వఱకును సజీవనై యిటులుండవలయును. ఈ పిల్లలు తండ్రినో, తండ్రి పిల్లలనో గుర్తించుకొను వఱకు. లేనిచో నేను మహా ద్రోహముచేసిన దానసగుదును. అయినను హా! తల్లీ! నా జీవితమెంత దుస్సహము. నీయోరిమి నాకుఁ గొంత బ్రసాదింపుము.

(ఇందిర ప్రవేశించును).

సీత:—అక్కా! ఏమే అది?

ఇంది:—ఆహా! ఆహా!

సీత:—ఏమి! విషయము దెలుపవేమి?

ఇంది:—తల్లీ! నీవు ధన్యురాలవు. రామచంద్రుఁడు దివ్యపురుషుఁడు. నాకంతకంటె వేఱానంద మేమున్నది? తల్లీ! నీవు ధన్యురాలవు.

సీత:—నాకేమి! కావుననే యిటులుంటిని. నీకేమి పిచ్చియెత్తినదా యేమి, పాపము?

ఇంది:—నిజముగ నటులనే యున్నది. బంగారు సీత! బంగారు సీతను ప్రక్కనుంచికొని యశ్వమేధముఁ జేయునఁట.

సీత:—అగును. నిజము వారికేతగునది. లోకోత్తరపురుషులు. హా హృదయమా! తాళుము. ఆనందమా! యిది విచారమా! అక్కటా! నాథా! ప్రాణేశ్వరా! వియోగము కంటె నీ విశ్వాసగౌరవమె నాకు భరింప శక్యముగాకున్నది. కుసుమ కోమలమగు నీహృదయము వజ్రకాఠిన్యముఁ బూని యెంత కటకటఁబడెనో! ఆ కరుణా కటాక్షములు దివ్య బాష్పార్ద్రములై ప్రసరించుచుండెనుగదా యింకను స్వామీ! - ఇప్పుడు నిజముగా నా హృదయశల్యము పెరికివేయఁబడినది. అయినను నీకీ వార్త నిప్పుడెవ్వరు చెప్పిరి!

ఇంది:—అమ్మా! మనము మేలుకొని యుండియు నిద్రించుచుంటిమి. ఇచ్చటి కనతిదూరమున తమసాతీరమునం దిటియే రెండవ యయోధ్యయొకటి నిర్మింపఁబడుచున్నదఁట! అచ్చటనే యశ్వమేధము జరుగఁగలదఁట.

సీత:—కాదు మనము నిద్రించుచు మేలుకొని యుంటిమని భ్రాంతిపడుచుంటిమి. ఇదియొక తీయని కల. సందేహము లేదు. కాకున్న నయోధ్యవదలి యరణ్యానులకు వచ్చి యిచట నశ్వమేధయాగము సేయుదురే!

ఇంది:—పులినోటినుండి జారిపడి పారివచ్చిన మేకపిల్ల తన్ను వెదకికొనుచువచ్చు తల్లినిజూచి కూడ నమ్మజాలక పులియేయని బెదరుచుండును. అటులగాక నీహృదయమును శాంతపఱచుకొని సావధాన మనస్కవై సాంతముగ వినుము. మహర్షి యాశ్రమమునకు పూజ్యురాలగు నరుంధతియు, మీయత్తగారు కౌసల్యాదేవియు, తండ్రి జనక చక్రవర్తియు విచ్చేసిరి.

సీత:—అయ్యో! ఇటువత్తురేమో! నేనెందు డాగుదును! ఇట్టి నేను వారల కెటుల కనఁబడుదును! దైవమా! నాపై నీకింకను దయరాదా!

ఇంది:—అమ్మా! రారు విచారింపకుము. (కన్నీరు కార్చుచు) ఎట్టి యవస్థవచ్చినది! వాల్మీకి మహర్షిలేరని వెడలి పోయిరి.

సీత:—శాంతకంటె నన్నెక్కుడుగఁ జూచెడిది. హా! తలఁచుకొనిన గుండె నీరగుచున్నది. అల్లుని మఖమునకు వెడలునపుడు నన్ను బిలిచి యెన్నియోచెప్పి - ఆబుజ్జగింపులు ఆ లాలింపులు - ఆ ప్రేమ - అట్టి నాయత్తగారు నేఁడు నామాటనైన దలపెట్టక వెడలిపోయెను గదా! "నాకుఁ గూతురైనను, కొడుకైనను, సర్వము

నీవ" యని చెప్పుచు నానందించు నాయనుంగు దండ్రియు నాపేరెత్తుటకుఁగూడ సిగ్గుపడియెను గదా!

ఇంది:—అమ్మా! నీ మనసదేలకో నేఁడు మున్నెన్నఁడులేని యధైర్యమునకు లోనగుచున్నదే! నీవిందుఁ గలవని వారెటులెఱుంగుదురు!

సీత:—అగును. మఱచితిని. వారికెవరర్ఘ్య పాద్యాదులొసఁగి సత్కరించిరి!

ఇంది:—చిరంజీవులు. మొదట నాకు వారెవరోకూడఁ దెలియక యూరక వెడగున్నై మాటుననుండి చూచుచు నిలిచితిని.

సీత;—వారెట్లుండిరి!

ఇంది:—తాపసవృత్తిఁ బూనియుండిరి. జీర్ణాగ్ని శిఖలనలె మెఱయుచుండిరి. అందు మీతండ్రి నేత్రములందు విచారమును, ఫాలమునఁ గ్రోధరేఖలును స్ఫురించుచుండెను. మీయత్తగారి వదనమున విచారము,దానికిఁ దోడవమానము గూడ భారమై యాపూజ్యురాలి శిరమును వంచివేయుచుండెను. ఆ బాలురఁజూచినంతనే.

సీత:—ఏవగించుకొన లేదా!

ఇంది:—అట్టిది సంభవమా! ఏటిమాటలివి! ఇంతబేలవైతివేల! సహజమగు వాత్సల్యము ముప్పిరిగొన, పిపాసాపీడితులు నిర్మలవారి పూరంబులఁజూచునటులనత్యంతాప్యాయముగ రెప్పవేయక చూడఁదొడఁగిరి. అప్పుడు కుశుని మీతండ్రియు, లవుని మీయత్తయుఁ దమతొడలపై గూరుచుండఁబెట్టుకొని మిక్కిలి ప్రియముగ

మాటలాడఁ దొడఁగిరి. ఆ సంభాషణమున వారలెవరో నాకును దెలియవచ్చెను. శ్రీరామాయణ కథానాయకుని తల్లియు, మామగారును అని వారిని దెలిసికొని కుశలవులు బాల్యసహజమగు నచ్చెరుపాటుతో వారలఁ దిలకింపఁ దొడఁగిరి. ఆముగ్ధలోచనముల వారప్పుడు నీపోలిక గుర్తుపట్టినటుల నాకుఁదోచినది. అంతట నిన్ను దలంచి వారు దుఃఖింప నా సందర్భమునఁ బూజ్యురాలగు నరుంధతిబంగారుసీతతో శ్రీరాముఁడశ్వమేధముఁ జేయఁదలఁచిన సంగతిఁ జెప్పి వారల నోదార్చెను. ఇంతలో లక్ష్మణస్వామివచ్చి వారిని యాగమున కాహ్వానించెను. అంతట మీ యత్తగారు "ఎటుల వత్తును నే నయోధ్యకు ?" అని ప్రత్యుత్తరమిచ్చిరి. కావున నే యన్నగారు మీ కొఱకై యీ యాగమును వనమధ్యమునఁ జేయ సమకట్టిరి. ఈతమసాతీరమున నే రెండవ యయోధ్య వెలయుచున్నది. అని చెప్పి మిక్కిలి వేడుకొని వారలఁదోడ్కొని చనెను. ఏమైనను సరే నీవిచ్చట నుంటివని వారల కెఱింగించి యిటకుఁ దోడ్కొని రావలయునని నిశ్చయించుకొని ముందునకు నేవచ్చు లోపల నేవారు లక్ష్మణునితోఁ బయనమయిరి. చిరంజీవులును వారిని నాగనంపుటకో యనఁ గొంత దూరము వెన్నంటిచని తిరిగివచ్చుచు "పాపము ! చాలవిచారించుచుండిరి ! అన్నా ! రాముఁడు చేసిన పనిమంచిదందువా!" యని తమ్ముఁడన్న నడుగుటయు, అన్నతమ్మునితో " చాలజాలిగ నున్నది. అయినను

గొప్పవారుచేసిన పనియొక్క మంచిచెడ్డలు మనము విమర్శింపలేము. తాతనడుగుదము. రానిమ్మా." అనఁదమ్ముఁడు "పోనిమ్మా. అమ్మనడుగుదము. తాతయ్యాకంటె బాగుగఁజెప్పును. ఇందాక చూడలేదా, యెంత బాగుగఁ జెప్పినదో!" అని వారు సంభాషించు కొను చుండ నాకు కడుపు తరుగుకొని పోయెను. అమ్మా! ఏమిది! పలుకవేమి! మూర్ఛపోయినది.

(అని శీతలోపచారములఁ జేయుచుండును.)

(తెర పడును.)

---

మూఁడవరంగము.

అరణ్యప్రాంతము.

(నేపథ్యమున)

పౌలస్త్యవంశ ధూమకేతువు. నిర్వక్రపరాక్రమ యశస్సంపాదన విరాజితుఁడు జగదేకవీరుండునగు శ్రీరామసార్వభౌముని యశ్వమేధాశ్వమిదిగో నిరాఘాటంబుగ భూప్రదక్షిణ మొనర్చుచున్నది. ధైర్యసాహసంబులుగల ప్రతివీరుండెవ్వఁడేని యుండెనేని, యెదుట నిలిచి యీ యుత్తమాశ్వమునుబట్టి బంధించుఁగాక. (అనిపిదప భేరిమ్రోగింతురు.)

(ఋషిబాలురు కొందఱుపరుగెత్తుచు తత్తరముగఁ ప్రవేశింతురు)

1. బా:—అయ్యబాబో! ఏమిదండురా యిది!

2. బా:—ఏమిభేరిరా! గుండె దడదడలాడుచున్నది.

1. బా:—ఆగ్రేడ రేమిపాపము ! మన పల్లెకుంబోయి కాని తిరిగి చూడరాదు.

2. బా:—ఫలములు - కుశలు - సమిధలు.

3. బా:—బ్రదికియుండిన రేపు తెచ్చుకొనవచ్చును.

1. బా:—రేపటికి పెద్దయెడారి యైపోవును. ఒక పచ్చని యాకైనను మిగులునటులం దోపదు.

2. బా:—అయినను మనకుశలవులేరి! వారు ధైర్యవంతులు, మనము పిరికివారమునంటగదా ! ఇప్పుడు చూడవలె. ఏమూల నక్కిరో.

3. బా:—నామాట వినిపించుకొనరేమి ! నేఁబోవుచున్నాను. మీ కర్మమువిూది.

1.-2. బా:—ఇదిగో మేమును వచ్చుచున్నాము. (అందఱును నిష్క్రమింతురు.)

(కుశ లవుల ప్రవేశము)

లవు:—అన్నా ! ఏమిదండిది ! మన పల్లెను ముట్టడించునా యేమి !

కుశు:—అట్లు చేయనేరదు. ఇది వాల్మీకి మహర్షి వాటిక యని యెఱుంగదా ! ఆయన యిక్కడ లేరుకనుకగాని యున్నచో నీయార్భాటములతో నీసేనయు గీనయు నీపరిసరములకు రానేర్చునే !

లవు:—నిన్న మనము వింటిమే ! ఆయాగ సంబంధమైనదేనా యీ సన్నాహము !

కుశు:—శ్రీరామ సార్వభౌముఁడని [illegible] కాఁబోలు వా్రుచ్చెను. ఆ కోలాహలమున నాకు [illegible] నను దెలిసికొందము.

(రెండవవైపునుండి దానవబాలుర ప్రవేశము)

1. దా. బా:—అహో ! ప్రియసఖులు కుశలవులు.

2. దా. బా:—తలఁపని తలంపుగఁ గలిసికొంటిమి.

కుశు:—ఏమి ! మీరిట్లేల వచ్చుచుంటిరి !

2. దా. బా:—ఆపిరికిపంద లట్లేల పారుచుండిరి !

లవు:—ఈ సైన్య కోలాహలముఁజూచి భయపడి పారిపోవుచుండిరి కాఁబోలు దానికేమి !

1. దా-బా:—ఇది యెవరిసైన్యము ? ఏమియాప్రకటనము ? అని తెలియఁగోరి వచ్చుచుంటిమి.

కుశు:—తమ్ముఁడా! చూడుము, చూడుము. అదిగోయశ్వము! మెరుపుదీగవలె ఒక ప్రక్కనుండి మఱియొక ప్రక్కకెటులదాటుచున్నదో !

లవు:—చూడ సొంపుగనున్నది. లోకచక్రమువలెఁ ద్రిప్పుచున్నది. ముఖమున నదేమి ! బంగారు రేకు కట్టినటులున్నది.

2. దా-బా:—ఎంత యందముగనున్నది ! అట్టి గుఱ్ఱముపై స్వారిచేసిన.

కుశు:—ముల్లోకముల నొక్కక్షణములోఁ జుట్టి రావచ్చును.

1. దా-బా:—దానిని మనము పట్టుదమా !

(నేపథ్యమున నింకను జేరువగ "పౌలస్త్య వంశధూమకేతు" అను ప్రకటనముఁ జదివి భేరి మ్రోగింతురు.)

కుశు:—వలదు. గుఱ్ఱమందముగనున్నది. కాని మఱియొకరి యాగమునకు విఘ్నముచేయరాదు.

1-2. దా-బా:—(పెద్దనవ్వు నవ్వుదురు.)

కుశు:—ఏలయట్లు నవ్వెదరు !

1. దా-బా:—(ఇంకను గట్టిగ నవ్వును)

లవు:—పిచ్చియెత్తినదా యేమి !

2. దా-బా:—కాదు కాదు. మీయన్నగారి హేతువాదముఁ గన మాకు నవ్వువచ్చుచున్నది.

కుశు:—ఏమి నేను తప్పు చెప్పితినా !

1. దా-బా:—లేదు. నిజమగు కారణము చెప్పితివి !

కుశు:—(కోపముతో) ఏమి! నే నసత్యముఁ జెప్పితినందువా !

2. దా-బా:—అట్లననేల ! కాని భయములేదు మేమును సాయపడుదుము. కావలయునని కోరుకొన్న దాని నూరక వదలుకొననేల ! ప్రియసఖా ! భయములేదు. మనమందఱమును గలిసి దానింబట్టి బంధింతము.

కుశు:—నేను భయపడితిననియా మీ యభిప్రాయము ? ఉత్తముల కార్యములకు విఘ్నములఁ గల్పించుట తగదని యంటిని.

2. దా-బా:—ఇంకను ఆమాటయేనా !

1. దా-బా:—కాదామఱి! ఉత్తములయినప్పుడు మనకందఱకు విధ్యుక్తధర్మమేయది. ఆత్మ స్తుతి పరనిందయుఁ గూడ నుత్తమ పురుషలక్షణములైనవి నేఁడు ! కాదా మిత్రమా !

కుశు:—(ఆలోచించును.)

2. దా-బా:—ఆత్మశ్లాఘన మేమున్నది! సత్యమును వచించు కొనె. నిర్వక్ర పరాక్రమవిరాజితుఁడట. ఇంతవఱకెప్పుడు మొక్కపోలేదు కాఁబోలు నాపరాక్రమము! జగదేక వీరుఁడఁట నిజమె. తక్కిన వీరులెల్ల హార్షించి యూర కయుండఁదన్నుదా నెవఁడట్లు ప్రకటించుకొనఁగూడదు. నిజముగా నాకందాత్మ శ్లాఘన మింతేనియుఁ గాన రాదు. ఏమందువు! ప్రియమిత్రమా! నీ యభిప్రా యముతోనేఁ బూర్తిగ నేకీభవించెదను.

లవు:—ఆ గర్వాతిశయము ప్రతిపదమందును బ్రకటిత మగు చునే యున్నది. అవును. లోకమున మఱి ప్రతివీరుఁ డెవ్వఁడును లేఁడనియే కాఁబోలు నాసగర్వ విశ్వాసము!

కుశు:—అవును. ఆవిషయము తెలిసికొనఁదగినదే. తమ్ముఁడా! నీవు వెంటనే పరుగెత్తుకొని వెళ్లి యా యశ్వమునుబట్టి మన యాశ్రమవృక్షములలోఁ జేవగలదానిఁజూచి దాని కంటఁగట్టిరమ్ము. ఈభూతలమున నొక్క వీరుఁడేకాని రెండవవీరుఁ డుండుటకుఁ దావుకలదో లేదో పరీక్షిం తము.

లవు:—ఆ క్షణమె (పరుగెత్తును.)

1. దా-బా:—అదీమాట. తమ్ముఁడా! మనవారి నందఱిని గూడ వేగమెవచ్చి యిటవ్రాలుమనుము. ఇప్పుడు మన మిత్రునకు బాసటలై నిలువవలయు. వారేమొ పెద్ద గుఱ్ఱములను, ఏనుగులను దీసికొని రథములపై నెక్కి వచ్చి మనల బెదరింతురు కాబోలు! తత్‌క్షణమ మనవారి నందఱను దీసికొని రమ్ము.

కుశు:—అక్కఱలేదు. నేను మీ రనుకొనునంత పిరికివాఁడఁ గాను, భయములేదు. నేనొక్కండనె యీచతురంగ బలంబులధాటికిఁ దాళఁజాలనేమో చూచెదను.

1. దా-బా:—స్నేహముచే నూరక పరిహాసమున కనిన మాటల నంతగఁ బాటింపకుము. తమ్ముఁడ ! ఇంకను ఇక్కడనేయుంటివా! జాగుచేసెదవేల!

కుశు.—వలదు. నామనో నిశ్చయమెఱింగించితిని. ఇందు నేను దానవుల సాయ మపేక్షింపను. ఒల్లను. నేనొంటరిగ నేల యీ సైన్యముల నెదుర్కొనఁ జాలనో చూచెద.

1. దా-బా:—మమునంత పెఱవారిగ భావించిన నీయిష్టము. అయినను సోదరా! మనమును దలపడుదము. ఈ వార్త మనవారల కెరిగించి వత్తము రమ్ము. ప్రియ సఖా ! సెలవైసంగుము. విజయనుఁబడసి యసహాయ శూరాగ్రేసరుఁడవని బిరుదముఁ బొందుము. అది మాకు మాత్ర మానందముకాదా! అదిగో బాలవీరుఁడొకఁడు వృద్ధ సారథి నడుపురథముపై వచ్చుచున్నాఁడు. త్వర పడవలయు.

(భేరులు మ్రోగుచుండును. దానవ బాలురు వెడలిపోవు దురు. సుమంత్రుఁడు రథము నడుపుచుండఁ జంద్ర కేతు ప్రవేశము.)

చంద్ర:—ఆర్యా! ఈ బాలుఁడేనా మనయశ్వమును బంధించి కొనిపోయినది. ఋషిబాలునివలె నున్నాఁడే ?

సుమం:—క్షత్రియ లక్షణంబులు కనఁబడియెడి. ఇతఁడె - కాడు. వీనిఁ బోలువాఁడు మరియొకఁడు. ఇంతయొ

వయసు. ఆకృతియు నిట్టిదియు. కాని దేహము బంగారు చాయ యనికదా చెప్పిరి.

కుశు:—సమ్ముఖమున రాయబారములేల? వీరవర్యా! ఏమి యాలోచించుచు నటుల సంకోచించుచుంటిరి!

సుమం:—ఓ మునికుమార! నీవెవరు? శస్త్రములఁబట్టి యుంటి వేల?

చంద్ర:—మాటలాడవేమి?

కుశు:—మీరు నన్నే మడిగితిరి?

చంద్ర:—(మందహాసముతో) నీనామధేయ మేమి? ముని కుమారుని కీశస్త్రములతోఁ బనియేమి అని.

కుశు:—నన్నుఁ గుశుఁడందురు. నేను క్షత్రియుఁడను. మీప్రశ్నము నాకిచ్చుచనవుచే మిమ్ముఁగూర్చి కూడనడిగి తెలిసికొనవలయునని కుతూహలమగుచున్నది.

సుమం:— నేను సారథిని.

కుశు:—సరియె. తెలియుచునే యున్నది. ఆ వీరుఁడురథికుఁడు. ఆవిషయములు కన్నులుగలవారికెల్లఁ దెలియునవియె.

సుమం:—ఆయనలక్ష్మణునిపుత్త్రుఁడు. అటుల చూచెదవేమి? శ్రీరామచక్రవర్తి ప్రియసోదరుఁడు, ఇంద్రజిత్తునుజయించిన మహావీరుఁడగు లక్ష్మణస్వామి పుత్త్రుఁడు.

కుశు:—ఓహో! అట్టి సంప్రదాయములోని వారా! తెలిసినది.

సుమం:—సరియె. కాని నిన్నొక విషయమడుగఁ దలఁచితిమి. అన్నివిధముల నిను బోలువాఁడు, నీ యీడు వాఁడు. పచ్చనిమేని కాంతివాఁడు. ఒకబాలుఁడు, చిన్న

తనముచేఁ దెలియక మహారాజుగారి యశ్వమును బట్టి
కొనిపోయెను. నీవు వానిజాడ నేమైనఁ జెప్పఁగలవా!

కుశు;—ఆర్య! ఏమి యీమాటలపొందిక! నేర్పరితనము!
చిన్నతనముచేఁ బెద్ద యశ్వమును గొనిపోయెనా! అది
మహారాజుగారిదా! దానిని మగుడఁ దీసికొనివచ్చు
టకు మీ యంతటివారిని బంపవలసినంత ప్రయోజన
మున్నది కాఁబోలు నాగుఱ్ఱమువలనఁ జక్రవర్తిగారికి!
అయినచో నాబాలు నప్పుడే యదలించి మందలించి
యీయశ్వమును విడిపించుకొన లేకపోతిరా! పాపము!
ఇప్పు డింతదూరము దానికొఱకు వెదకుచు రానేలఁ?

సుమం:—అది శ్రీరామ సార్వభౌముని యశ్వమేధాశ్వము -
వానిలే బ్రాయమును గాంచియో యీసాహసమును
జూచియో యచ్చటి కాపరు లక్కజపడి యించుక
వినోదమునకొయన నూరకుండి చూచుచుండఁగా క్షణ
ములోనాబుడుతఁడశ్వముతోఁగూడనదృశ్యుఁడయ్యెను.
నీవు వానింగూర్చి యేమైన నెఱిఁగియున్నచోఁ జెప్పుము.
చక్రవర్తికడనుండి పారితోషిక మందఁగలవు.

చంద్ర:—మిత్రమా! నిన్నుఁ జూచుచున్న కొలఁదియు నాకుఁ
జిరకాల పరిచితునివలె గన్పట్టుచున్నావు. దాపకుము.
మనప్రభువుకార్యము. వానిగూర్చి తెలిసినచోజెప్పుము.
నేన నీవేదికోరిన నదియిచ్చి సంతోషపఱచెద.

కుశు:—వానినే నెఱుఁగుదును. వాఁడు నాసోదరుఁడు. నాపంపు
ననేవాఁడా కార్యమొనరించెను. మీచక్రవర్తి యిచ్చు
పారితోషకములతో సంతసించెడి వారముగాము మేము.

[సుమంత్రుఁడు, చంద్రకేతువు ఒండొరులఁ జూచుకొందురు].

చంద్ర:—ఆ యశ్వమును వదలివేయుము.

కుశు:—అడిగిన మాత్రముననే వదలివేయు నెడల దానిని బంధించియే యుండము.

చంద్ర:—మనకు శత్రుత్వముకంటె మిత్రత్వము సహజముగ నొప్పియుండునని నా హృదయమునఁ దట్టుచున్నది. వ్యర్థముగ శత్రుత్వముఁ బెంపొందించుకొనుట తగదు. మిత్రమా! అశ్వమును వదలివేయుము.

కుశు:—జగదేక వీరుని యశ్వము ప్రతివీరునిచే బంధింపఁబడి నప్పుడు దానిని విడిపించుకొనఁగల మార్గ మిదియా! అయినచో నీ సైన్యములు, గుఱ్ఱములు, ఏనుఁగులు, పటాటోపమంతయు నెందులకు? మేలు. మేలు. దుందుభులు మ్రోగించి ప్రకటించుకొనెడి యీ బిరుదావళి యెల్లసార్థకమని యిప్పుడుగదా ప్రత్యక్షమయ్యెను.

సుమం:—బాలక! ఏమో పెద్దగ నుపన్యసించుచుంటివి. అంతరు వెరిగి మాటలాడవలయును. ఇట్టి యవసరంబుల నీవు పసివాఁడవని యిసుమంతయుఁ గనికరింపఁబడవు సుమా!

కుశు:—ఓ లక్ష్మణ వీరకుమారవర్య! నన్నెటులైనఁ గనికరింపుఁడని కోరుచుంటినా! నేను నీతోడ మాటాడుచుండ నడుమ నడ్డమువచ్చి యిట్టి యసంబద్ధ ప్రసంగముఁ జేయు నేమయ్యా మీసారథి!

చంద్ర:—అదేలకో మనకుఁ గయ్యము గలుగుట నాకు మనస్కరించుటలేదు. కావున నీవు మొండిపట్టు పట్టకుము. కోరుదువేని నట్టిదే మఱియొక యుత్తమజాతి

యశ్వము నిప్పించెదను. తీసికొనుము. ఈ యాగాశ్వ మును విడిచిపెట్టుమనుము. కాదేని నిప్పుడు మనకు యుద్ధము తప్పదు. ఈ భూమండలము నెల్ల నేకచ్ఛత్ర ముగఁ బాలించు శ్రీరామ సార్వభౌమునితో వైరము పూనుట యెంతలేసి వారికినిఁ జెల్లదు. అట్టిచో నీవు బాలుఁడవు, ఒంటివాఁడవునని యింతదూరము చెప్పు చుంటిని. నామాటఁ గాదనకుము. మిత్రమా! అశ్వ మును విడిచిపెట్టుము.

కుశు;—శ్రీరామ సార్వభౌముని గూర్చియు వాని పరాక్రమా దులఁగూర్చియు నాకడఁ గొత్తగఁ బొగడనక్కఱలేదు. అయినను ఈ విశాలభూతలమున నొక్క వీరునకే కాని మఱి యట్టి రెండవ వీరునకుఁ దావేల లేకుండునో చూడ వలయునని నిశ్చయించితిని.

చంద్ర:—మంచిది. రాఘవ శ్రేష్ఠునకే జగదేక వీరుఁడన్న బిరు దముండుట సహింపకుంటివిగా! యుద్ధము నిశ్చయము.

కుశు:—మేలు. అందులకే సంసిద్ధుఁడను.

చంద్ర:—(సారథితో) ఆర్య! సుమంత్ర! రథము నీచెంగటనే నిలిపియుంచుము. (ధనుర్బాణములచేఁ బూని రథము నుండి దిగ నుద్యమించుచు) పాదచారితో రథారూఢు నకు ద్వంద్వయుద్ధము ధర్మముగాదా!

సుమం:—(స్వగతము) కాదనుట యెట్లు! అనకుండు టెట్లు! అక్కటా! ఇప్పుడేమి చెప్పుదును. ఆబాలవీరుఁడును సామాన్యుఁడు గాఁడనుట స్పష్టమగుచున్నది! ఏమి చేయుదును!

కుశు:—ఆగుము. వలదు. దిగవలదు. నీవు రథముపై నుండు టయే మిక్కిలి యొప్పుచున్నది.

(సుమంత్ర చంద్రకేతు లాశ్చర్యముతోఁ గుశునిఁజూతురు).

సుమం:—ఆయుష్మంతుఁడా! మిత్రుని కోరిక చొప్పున నే చేయుము.

చంద్ర:—అయినచో నీవును, మఱియొక రథముఁ దెప్పించె దను, దానిపై నెక్కి యుద్ధముచేయుము. అది ధర్మము.

కుశు:—సుహృద్భావమున నట్టిదాని నంగీకరించుటకు నాక భ్యంతర ముండఁజాలదు. కాని నాకభ్యాసము లేదు కద రథముపై నుండి యుద్ధముచేయుట! నాకు భూత లమున నిలిచియుండుటయే సులువు. నీకట్టి సంకోచము వలదు.

చంద్ర:—కడసారి యడుగుచుంటిని అశ్వమునువిడువవా!

కుశు:—నన్నటులడుగుట నినుబోలు వీరునకుఁ దగునా! యుద్ధ మందు జయించి విడిపించుకొమ్ము.

సుమం:—ఇంక వీనితో మాటలవలనఁ బ్రయోజనము లేదు.

చంద్ర:—జయించియే విడిపించుకొనెద. కాచుకొనుము.

(బాణము విడుచును. కుశుఁడు బాణమువిడుచును. రథము వెనుక కరుగును. కుశుఁడు తరుముకొనుచు ముందున కుఁబోవును. ఇట్లు నిష్క్రమణము).

(నేపథ్యమున)

"మరణింపలేదు. మూర్ఛిల్లెను. వైద్యశాలకు. వైద్యశాలకు" (అని చంద్రకేతు కంఠము వినఁబడును. పరుగుపరుగున లవుఁడు ప్రవేశము.)

లవు:—అన్నా! అన్నా! అదిగో నాయన్నను రథముపై నిడికొనిపోవుచుండెను. (పరుగిడి) రథమతి వేగమైపోయినది.—హా! ఏమి! నాసోదరుని శత్రువుల కప్పగించి నే నూరకుండవలసినదా !

(రామ సైన్యమునుండియోధుఁడుం ప్రవేశము).

యోధు:—లవకుమార! నీవు యాగాశ్వమును విడిచిన నీయన్నను విడిచి పుత్తుమని మా చంద్రకేతు ప్రభువుగారు నీకెఱింగింపుమనిరి.

లవు:—అన్నను విడిపించుకొనఁజాలఁడేని లవుఁడు యుద్ధమునఁ బ్రాణములు విడుచునుగాని యశ్వమును విడువఁడని మీ ప్రభువున కెఱింగింపుము. పొమ్ము. వార్తాహరుఁడవై బ్రతికిపోయితివి.

(యోధుఁడు వెడలిపోవును)

లవు:—వాని కావరము మితిమీఱుచున్నది. ఊరక రోషించి ప్రయోజనము లేదు. నాసోదరుని విడిపింపఁజాలనా ! ఏమైనఁ గానిమ్ము. ముల్లోకములు భస్మీపటలమై బ్రహ్మాండకటాహము బ్రద్దలయిన నగుఁగాక. జృంభకాస్త్రము నిప్పుడే ప్రయోగించెద.

(ధ్యాన నిశ్చలుఁడై బాణము సంధించుచున్నాఁడు. నేపథ్యమునఁగలవరము. తెరఁజిమ్ముకొని వాల్మీకి ప్రవేశము)

వాల్మీ:—ఉపసంహారింపుముపసంహారింపుము. మహావిలయమునుపసంహారింపుము.

లవు:—(సాష్టాంగ నమస్కారము గావించి ధ్యాన నిశ్చలుఁడై కనులువిచ్చి) గుర్వాజ్ఞయే యుపసంహారించినది. కాని

ముందుగ నేమియు నడిగి తెలిసికొనకయే నన్నిటు లాజ్ఞాపించితిరి గదా ! అన్న శత్రువులకుఁ జిక్కి—

చంద్ర:—మహాత్మ ! లక్ష్మణపుత్త్రుఁడు చంద్రకేతువు నమస్కరించుచున్నాఁడు.

వాల్మీ:—ఇష్టకామ్యార్థసిద్ధియగు గాక.

చంద్ర:—ఘోరవిపత్తునుండి మమ్మును నీలోకమునుగూడ నుద్ధరించినది తమ భూతదయయు ధర్మపక్షపాతమె కద !

వాల్మీ:—నీవు మానత్సను కుశుని మాకప్పగింపుము.

చంద్ర:—చిత్తము. వినయపూర్వకముగఁ గొనివచ్చి వీరాధివీరుల మించిన యీ బాలవీరుని మీ పాదకమలముల సమర్పించుకొనవలయుననియే వచ్చితిని. మిత్రమా ! వారుగో మీ గురువులు. అదుగో ! ఇనుమడించిన తేజముతో దీర్ఘోచ్ఛ్వాస నిశ్శ్వాసములతో తీక్ష్ణంబులగు వీక్షణంబులతో మాపై నింకను గోపము తీరక చూచుచున్నాఁడు చూడుము, నీ సోదరుఁడు ! వారలఁగలసికొనుము. వానిని నాపక్షమున శాంతపఱతువని కోరుచున్నాను.

కుశు:—యుద్ధమునఁ బరాజితుఁడై శత్రువులచే బందిగఁ గొంపోఁబడిన కుశుఁడు నమస్కరించుచున్నాఁడు. (వాల్మీకికి నమస్కరించును.)

వాల్మీ:—నీ పూర్వులమించి యశమార్జింపుము. నీ తమ్ముఁడింకను గదనము సలుపుచుండఁగనే జయాపజయము లెట్లు నిర్ణయింపనగును ? కాని యిరుపక్షములవారు నార్యులు. ఏకజాతివారు. ఇది కుటుంబ కలహ మనఁ

దగును. అట్టికలహ మేరికిని నేనాఁడును శ్రేయోదాయకము కాఁజాలదు. మఱియుఁ జక్రవర్తియన మీకుఁదండ్రియని యెఱుంగవలయు. అట్టివాని యాగమునకు వాని ప్రజలగు మీరు ఆటంకముగ నిలుచుట తగియుండునే? మఱియు నీ పుడమి నావరించియుండిన మహాత్మా మనివృత్తికొఱకు సంకల్పింపఁబడినదీ యశ్వమేధము. అట్టి సర్వోత్కృష్టంబగు కార్యమునకు సాయపడుట యొప్పునుగాని విఘ్నముచేయుట తగదు. నిజముగ మీరెన్నఁడును నిట్టి కార్యముఁ జేయుదురని నేననుకొనలేదు. బాలురగు మిమ్మెవ్వరో యిక్కార్యమునకుఁ బ్రోత్సహించి యుందురు.

కుశు:—నిజముఁ బల్కితిరి. మేము తప్పుఁ జేసితిమి. నామిత్రుఁడగు చంద్రకేతువుకూడ చాలవఱ కీ రీతినే బోధింపఁజూచెను. ఆవేళా విశేషముచే నాకామాటల కర్థమన్యథాస్ఫురించెను.

లవు:—అన్న మొదట యీ పని కిష్టపడలేదు.

కుశు:—తల్లి మాట జవదాటితిమి. దానిఫలమిది.

వాల్మీ:—ఇప్పుడు మించినది లేదు. మీరాయశ్వమును విడిచిపుచ్చి చక్రవర్తికడకు స్వయముగఁ బోయి క్షమింప వేఁడుకొనుఁడు.

(కుశలవు లొండొరులఁ జూచుకొందురు.)

కుశు:—మిత్రమా! చంద్రకేతు! రమ్ము. గుఱ్ఱము నిచ్చివేయుదుము. తమ్ముఁడా! ఎచ్చట నున్నదో దారి చూపుము.

చంద్ర:—(కుశలవుల నాలింగనము చేసికొని వాల్మీకికి నమస్కరించి, మహర్షి చంద్రమా ! మాకు మీవలన నీ సంధి కుదిరినది.

(వాల్మీకి తక్క మిగిలినవారు లవునితో వెడలిపోవుదురు.)

వాల్మీ:—దైవకృపవలన సరియగు సమయముననే వచ్చితిని. లేనిచో నెంత ప్రమాదము వాటిల్లెడిది ! జృంభకాస్త్రముఁ బ్రయోగించెను ! కుఱ్ఱవాఁడు ! వానికేమి తెలియును. సహవాస దోషముకాని స్వబుద్ధిచే వారీ కార్యమునకుఁ గడంగియుండరు. కుటిలులగు దానవు లెవ్వరో యీబాలుర నిందులకుఁ బురికొల్పియుందురు. ఔను లవణాసురుఁడీ ప్రాంతముననే కదా యెందో డాగియుండెనని వింటిని ! కానిమ్ము ఇప్పుడన్నియు శుభముననే ట్రోవచూపుచున్నవి. చక్రవర్తి మ్రోలఁ బశ్చాత్తాపమును జెప్పుకొనుట యన్న పసివాండ్రకుఁ గష్టముగ నున్నది. అయినను దాననే సర్వశుభములు చేకూరుఁగాక. (వెడలిపోవును.)

[చెల్లాచెదరై విశావి కలుగ శ్రీరామసైన్యము రంగస్థలముపై నొకవైపునుండి మఱియొకవైపునకుఁ బరుగెత్తుచుండును.]

[నేపథ్యమున]

"తాళలేము, అసురులు, లవణుఁడు, రాక్షసులు, రాక్షసులు

శూర్పణఖ, శూర్పణఖ."

[చంద్రకేతువు ప్రవేశము.]

చంద్ర:—ఏమిది! శ్రీరామసైన్యము లాయివి! (సైనికులు బారులు తీరి నిలుతురు.

చంద్ర:—సార్వభౌముని యాగాశ్వము విడిపింపఁబడినది.

అందఱు:—జయ్! శ్రీరామచక్రవర్తికి జయ్!

చంద్ర:—మన మాయశ్వము వెంట ముందునకుఁ బోవలయును.

[నేపథ్యమున]

అయ్యో! ఈ రాక్షసులు మాపైఁ గవియుచున్నారు. ఇంత పఱకు లవణుఁడును వానివెంట నొక స్త్రీయుఁ గనఁబడుచుండిరి. ఇప్పుడెటు చూచినను దశకంఠుఁడే. హా! హా! హా!

చంద్ర:—అది సత్యము-స్ఫురించుచున్నది. నిరాశచే నిప్పుడు బయలుపడిరి. ఇదిగో చంద్రకేతువు వచ్చుచున్నాఁడు. భయము లేదు. ధైర్యముఁ బోనాడకుఁడు. (బాణము సంధించి) ఈ రాక్షసమాయ విచ్ఛేదము గావించి. యసురులనెల్లఁ బరిమార్చి-(అనుచుఁబరివారము వెంట రాఁదట్టిల్లతవలె తెరలోని కరుగును. తెరలో వెలుగగపడును.)

[నేపథ్యమున]

హా! చచ్చితిమి! చచ్చితిమి! (పిదప) జయ్! శ్రీరామ సార్వభౌమునికి జయ్!

పౌలస్త్యవంశధూమకేతువునకు జయ్! జగదేకవీరునకు జయ్!

[చెటియొక వైపునుండియు శూర్పణఖయు లవణుఁడును వచ్చి రంగముపైఁబడి తెప్పిరిల్లినటుల లేచి యొండొరులఁగాంచి సిగ్గుపడుచు తలవంచుకొని లేచి డగ్గఱి.]

లవణ:—తుదికంతయు నిట్లయినది.

శూర్ప:—కానిమ్ము. కుశలవులు బెదరి లొంగిపోయిరి. మన మొక్క గడియముందు వచ్చినచో వారటుల ధైర్యపడి లొంగి పోకపోదురు. రామసైన్య మడక తెరలో వక్కగతి నయ్యెడిది.

లవణ:—అదియుఁగాక యీ ముసలివాఁడువచ్చి మనప్రయత్నముల నెల్లపాడు చేసెను. చూడు మాదర్పము!

(తెరలోనికి రామసైన్యము నుద్దేశించి చూపును.)

శూర్ప:—చంద్రకేతువు ప్రయోగించిన దివ్యాస్త్ర మేదై యుండును?

లవణ:—మనకేమియుఁ దెలియుట లేదు. మనబలము లన్నియు మాత్రము సర్వనాశనమైనవి. ఇప్పుడేమి చేయుదుము.

శూర్ప:—ఆగుము, ఎవరో యిటువచ్చుచున్నటు లున్నది.

లవణ:—దండు.

శూర్ప:—అగును, మనదే యాధ్వజము.

లవణ:—మనకీఁక దండెక్కడిది?-నా మొడమ కన్నదరుచున్నది.

శూర్ప:—దానవసైన్యమే, నిస్సంశయము.

లవణ:—ఏలయో నాకు భయమగుచున్నది.

శూర్ప:—భయమేల! నే సర్వము గనుఁగొనియెద. నీవు మాటలాడక యూరకుండుము. [రంగస్థలముపై దానవ

సైన్యము నడిచిపోవుచుండును. "జయజయరాం-రాం-జయ సీతారాం - "అని పాడుచు లయగలిపి నడతురు. చిట్టచివర నిరువురు దండనాధులు లవణుని శూర్పణఖను దేరిపారఁజూచి గురుతింతురు.]

1. దం-నా:—అహో! శూర్పణఖా దేవికిఁ బ్రణామములు.

శూర్ప:—శుభము. మీరెక్కడికీదాడి!

1. దం-నా:—దాడికాదు. శ్రీరామ సార్వభౌముని యశ్వమేధయాగ సంరక్షణార్థము పోవుచున్నాము.

శూర్ప:— మేలు.

2. దం-నా:—అమ్మగారింక నిచ్చటనే యుండిరే.

శూర్ప:—లేదు. వెళ్లుచున్నాను. అన్నగారేరీ! రాలేదా!

1. దం-నా:—ఇంతకుముందే విమానముపైఁ జనియుండిరి.

2. దం-నా:—వారెవరు? - ఓహో! నీవా! లవణా! ఎంత కాలమునకుఁ గనఁబడితివి! రమ్ము. ఊరకచూచుచు నిలిచెదవేల! మహాక్రతువునకు రాక్షసవీరు లెల్లరావలసినదిగ ప్రభువువారి యాజ్ఞ.

లవణ:—మీరరుగుఁడు.

1. దం-నా:—ఏమి! నీవురావా! అటులసంశయించెదవేల!

శూర్ప:—మీ వెనుకనే వచ్చును. మేమిరువురమును గలిసి వత్తుము. నాకు మార్గమునఁ దోడుగ నుండగలఁడు.

1. దం-నా:—ఇక్కడనొక ఘోరయుద్ధము జరిగిన చిహ్నములు పెక్కులు తోచుచున్నవి!

శూర్ప:—ఔను. జరిగినదఁట. నేనును ఇప్పుడేవింటిని. ఆర్యులు మనవారలఁ బెక్కండ్రనకారణముగ నస్త్రప్రయోగముచే భస్మము గావించిరఁట !

2. దం-నా:—అమ్మా ! ఎవరు !

శూర్ప:—ఇచటి మునులోయెవరో !-ఇంకను బాగుగఁ దెలియ లేదు. అందులకే యిచ్చటనాగి యీ విషయముఁ బూర్తిగ గ్రహించి రావలయునని నిలిచితిని. మీరరుగుఁడు.ఆసార్వభౌముని మహాయాగమునకేమిసాయము చేయవలసియుండునో! జాగుసేయనేల ? అన్నగారు గూడ శ్రీరామభక్తులు. మీరు జాగుజేసిన నాగ్రహపడుదురు.

1. దం-నా:—నిజము. సెలవు.

శూర్ప:—మంచిది

లవణ:—(ముఁందునకువచ్చి) హా ! ఎంత దౌర్భాగ్యస్థితి వచ్చినది నేటికీ పుణ్యజనులకు ! ఇతరులు తమ జాతివారినిఁ దగులఁబెట్టి బుగ్గిచేసిరన్నను వారి హృదయములు చలింపవు. ఏమి ! ఏమిభక్తి ! భక్తి! భక్తి! పౌలస్త్యకుల ధూమకేతువునని ప్రకటించుకొనుచున్నవాని యాగమునా కాపాడుట ! ఆహా ! ఆహా! ఏమి వీరి హృదయములు ! నిజముగ మీకు హృదయముకలదా! మీరు జంత్రపుబొమ్మలు కారా ! మనజాతికత్యంత విభవౌన్నత్యముఁ గొనితెచ్చిన రావణేశ్వరుని నప్పుడే మఱచితిరా ! మనజాతికెల్ల మహాద్రోహము గావించిన విభీషణుఁడు నేఁడు మీకు ప్రభువా ! ఆ రావణుని

నక్రమముగఁ జంపిన ఘాతుకుఁడు మీకు సార్వ భౌముఁడా! వాని యాగమునకు మీరు సంరక్షకులా! అరరె! ఏమికాలము వచ్చినది!

శూర్ప:—లవణా! ఏమి మాటలాడుచుంటివి! పలవరించు చుంటివా! ఏమిమాటలివి!

2. దం-నా:—(శంఖముఁ బూరించును) (సైనికులు వత్తురు)

1. దం-నా:—ఈరాజద్రోహిని బంధింపుడు. (సైనికులటులఁ గావింతురు.)

లవణ:—రావణ సోదరీ! శూర్పణఖా! అయ్యో! ఇది న్యాయమా! నన్ను విడిపింపఁజాలవా!

శూర్ప:—స్వయంకృతాపరాధమున కెవరేమిచేయఁగలరు!

2. దం-నా:—వీనిని బభ్రువుహారి సముఖమునకుఁ గొనిపోవు దుము - అమ్మా! సెలవు.

1. దం-నా:—దేవి! ఈసేవకులయెడ దయయుంచుము.

శూర్ప:—(మందహాసముతో) అవశ్యము. మీరు మిక్కిలి ప్రభుభక్తి పరాయణులగుట జగద్విదితముగద! మీ రరుగుచుండుఁడు. నేను గగనవీధిని జనుదెంచి యన్న గారిని గలిసికొనెదనని చెప్పుఁడు.

లవణ:—(స్వగతము) కలిసి కొందువు - అక్కటా! నావంటి మూర్ఖుఁడెందైనఁగలఁడా! హతభాగ్యుఁడను. అయినను దీనిని మాత్రము నిలువనిత్తునా! దీనిగుట్టెల్ల బయట బెట్టి తీరెదను. (శూర్పణఖతక్క మిగిలినవారు వెడలి పోవుదురు)

శూర్ప:— వానివలనఁ గార్యము సాధింపనెంచితిని - కాని ఫలము క్షణములో జారిపోయినది. ఇటుపై వాఁడు నాకు మెడకు గుదికట్టవలె బరువుచేటు. ఇప్పటికిదియు నొకవిధమున మేలునకే వచ్చెను. లేనిచో నాతో పాటుగ, నిటుపై నెందుకు నక్కఱకురాని యీ మూర్ఖునికూడ నెక్కడ వెంటఁబెట్టుకొని తిరుగఁగలను? అయిన నిఁకముందుఁ గర్తవ్యమేమి! - రాక్షససైన్యములయందు రావణునియెడ భక్తియు విభీషణుని యెడ ద్వేషమును గడు నేర్పుతోఁ బురికొల్పవలయును. ... ... ... హా! రామచంద్ర! నా తలఁపులమాటున నెప్పుడును నీవె డాగియుండి - జవనిక మాటుననున్న సూత్రధారునివలె - నీపాత్రచే నెట్టి విచిత్రనాటక మాడించుచుంటివి! తుదికిది సుఖాంతముగఁ బరిణమించునో! విషాదాంతముగ ముగియునో! - ఎట్లయినను నా జీవితాంతమువఱకు నారాముని వలచు నాటకమునే నాడుచుందును. అందే నాకొకవిధమగు నానందము గలుగుచున్నది.

(తెర పడును.)

# పంచమాంకము.

## మొదటి రంగము.

—❀—

సీత పర్ణశాల.

( సీత - కుశలవులు. )

లవు:—అమ్మ ! నీవెట్లయినఁ దాతయ్యతోఁ జెప్పవె.

సీత:—మన మొక కూడనిపని జేసినప్పుడు. "ఔను. మాది తప్పు." అనియొప్పుకొనుట గొప్పసుగుణములలో నొక సుగుణము. మొన్న పులినిజంపి పిల్లనుదీసికొనివచ్చుట "తప్పు" అనినా యెద్దనొప్పి కొనలేదా ! అటులనే యీ యశ్వమును బట్టుటకూడ "తప్పు చేసితిమి" యని మీతం — (మాటు మోముపెట్టి కనులొత్తు కొనును.)

కుశు:—కనులొత్తుకొనుచుంటివేమి ! అమ్మా ! కొలఁకుల వెంట నీరు కారుచున్న దేల ?

సీత:—లేదు. (కుశలవులఁ జెరియొకతొడపైఁ జేర్చి శిరము మూర్కొనును)

లవు:—ఎందరోయుండఁగ నానిండుసభలో "మాతప్పు మన్నించి క్షమింపుఁడని" వేఁడుకొనవలెనఁట.

కుశు:—సారి గుత్తమునా వారికిచ్చివేసితిమి. వారియాగమా నిర్విఘ్నముగ నేఁటితోఁ బరిసమాప్తి యగుచున్నది. కాని మాకీ పశ్చాత్తాపముఁ జెప్పుకొనుట మిగిలినది.

లవు:—ఇక నేఁడు తప్పదనుచుండెను.

సీత:—గురువులమాట నతిక్రమింపరాదు. పెద్దలు చెప్పినటుల నడచుకొనిన సదా మనకు మేలుకలుగుచుండును.

లవు:—తాతయ్యయయినను మా వెంటరాఁడఁట - మేమొంటరిగ నెట్లు పోదుము ? ఏమొచాల.

సీత:—భయము లేదు. చిట్టి తండ్రీ ! చక్రవర్తి మిక్కిలిమంచివారు. నామాటవినుఁడు. మిమ్ములఁ జిన్నిబిడ్డలఁ గసరి కొట్టరు.

కుశు:—అమ్మ మాట మన కవశ్యము భగవద్వాక్యము. తమ్ముఁడా ! లెమ్ము ! పోయివత్తము రమ్ము.

[కుశలవులు లేచి, తల్లికి శిరమువంచి నమస్కరించుచు]

కుశు:—అమ్మా ! పోయివత్తుము. ఆశీర్వదింపుము.

సీత:—(స్వగతము) హృదయమా ! క్షణమాత్రము శాంతింపుము. కింకమా స్తంభింపకుము. (ప్రకాశముగ) ఆ పేరోలగంబున నుచితగౌరవంబులఁబడసి మీయహాస్థానము నాక్రమించుకొందురుగాక. పుత్త్రుల గురితించి

(కుశలవులు వెడలిపోదురు)

యాతొడలపైఁ గూర్చుండఁ బెట్టుకొని శిరములమూర్కొనుచు ముద్దాడునా ! నాజీవితార్థము సిద్ధించునా ! ఏమి పేరాన! అక్కటా! నేనమ్మఁజాల. ఇట్టి వెఱ్ఱియాశలు

మెఱపుదీగలవలె పిదప నిరాశాదుఃఖాంధకారము నిను మడింపఁ జేయుటకే కలుగుచుండును. "బాలకులార! క్షమించితిమి! పొండు. ఇటుపై బుద్ధిగలిగి తలకు మీరిన వెఱ్ఱిపోకడలకుఁ బోకుఁడు" అని మందలించి పంపివేయునేమోకద! ఓ పరమేశ్వరా! కరుణానిధీ! కల్యాణమూర్తీ! శ్రీరామచంద్ర! సీట ముంచినను పాలముంచినను నీదే భారము. దీనురాలనై వేఁడుకొను చుంటిని. ఇటులఁ జేయుమో దేవా యని వాయెత్తి యడుగుకొనుటకై సాహసింపఁజాలకుంటిని. నిలువనీడలేని నిరుపేదయెందు మోదునానుకొని వడంకుచుఁ గూర్చుండి "హా! పాపిష్ఠదైవము! ఎందులకీ వాన! యని వగచును. హ్రస్వదృష్టులము. కించిద్జ్ఞులము. మేమే మెఱుఁగుదుము. సర్వము నీవయెఱుఁగుదువు. సర్వజీవ హృదయ కమలస్థ తేజస్స్వరూపా! సర్వజ్ఞా! భవదిచ్ఛయె సర్వలోకశుభప్రదము.

(తెరపడును.)

## రెండవరంగము.

తమసాతీరమున నూతన నిర్మితమగు యాగనగరమందొక వీధి.

కడుదూరమునుండి నడిచి వచ్చుచున్నదియుఁబోలె నభినయించుచు నిందిర ప్రవేశించును.

ఇంది:—ఆహా! స్వర్గమర్త్యపాతాళంబులు మూఁడు నిచ్చటనే సమావేశమయ్యెను. దేవమానవ రాక్షసులు

నేఁడిచ్చట సోదరులువలె కలసిమెలసి తిరుగుచున్నారు. రాజర్షి బ్రహ్మర్షి దేవర్షులాదిగ పామరులగు కుంటి, మూగ, గ్రుడ్డిమొదలగు బిచ్చగాండ్రవఱకు నెల్లరు ననుదినము నిచ్చటికివచ్చి సఫలీకృత మనోరథులగుచున్నారు. పశుపక్ష్యాదులు సైతము నిత్యము విందులు గుడుచుచు మఱియొకచోటునకుఁబోక వేఱు చింత దక్కి శాంతముగ నిచ్చటనే సుఖంచుచున్నవి. కాని ఓ రామచంద్ర! నీయీ మహా యాగమందీ యింతర యాప్సితమింకను నీదేరకున్నది నీసేవకులు వచ్చి నాపైఁ బలుమారులం కనకరత్నవర్షములు కురిపించి పోవుచుండిరి. కాని అక్కటా! నాకేఁక నాబంగారముతో రత్నములతో నేమిపని! నేనేమిచేసికొందును! చిరకాలమయినది! ఒక్కసారి నాపుత్త్రుని భర్తను జూడవలయునని పిచ్చికోరిక కలిగినది. ఈ మహాతీర్థము నందాకోరిక యీడేరునేమొ యని వెఱ్ఱియాశకూడ దానికిఁ దోడై ననూ్నరక యిటు లీడ్చికొనిపోవుచున్నది. కాని నాకిందు మొదలేదియో తుదియేదియో తెలియుటలేదు. ఏమి. యీరాజమార్గములు! రాచనగరులు, విడుదులు, పర్ణశాలలు. ఆశ్రమములు! ఎవరికిఁ దగినవి వారికి. ఆహా! సార్వభౌముని యాజ్ఞాప్రభావము! వచ్చెడి రథములు పోయెడి రథములు! ఎవరో ఆరాజు, రాణియుఁ గొడుకును; అదిగో యజ్ఞమందిరమునకుఁ బోవుచున్నది రథము! ఏమి యాతులలేని కానుకలు! రథము పట్టఁజాలకయున్నది! ఫలములు

పుష్పములు, నీదేశములోనివి కావు. వినూత్నసౌర భములు! విజాతీయముగ నున్నవి! వీధియెల్లఁ గ్రమ్ముకొన్నవి. ఈమహాసమ్మర్దములో, ఈమహాజన సమూహములో నేనెచ్చటఁ జూతును! ఒకవేళ వారు రాలేదేమో.-అసంభవము. ఏల రాకుందురు! బ్రతికియుండినఁ దప్పక వచ్చియుందురు. (కొంచెము ముందునకు నడిచి) ఈ చతుశ్శాలకడ నిలిచెదను. కాళ్లు లాగుచున్నవి. చెమటలు కారిపోవుచున్నవి, (పైఁట చెఱగుతో విసరికొనుచు) ఆకలి చచ్చినది. దప్పిక మిక్కుటమగుచున్నది. దప్పిక చావదా! ఏమైనఁగానిమ్ము. (కూర్చుండి) ప్రాణములు పోయినను సరె ప్రతిన విడువను. నాకిన్న కొడుకు మొగముఁ జూడవలె! పిదప జీవించియుంటినేని నీటితో జిహ్వ తడుపవలె నాచుట్టు నున్నది సాగరము. అనందసాగరమె! కాని నేనందు మునిగి పోవుచున్నాను. హాపుత్రికా! కుమారా! నా కన్నతండ్రి (అని బిగ్గరగఁ బిలుచును. కొందరు వత్తురు).

1:---అమ్మా! ఎవరు నీపుత్త్రుఁడు! తప్పిపోయెనా! వాని వయ సెంత యుండును!

ఇంది:—పదునైదేండ్లయినది.

2:—అయిన బొత్తిగ బాలుఁడు కాఁడు. భయములేదు. తల్లీ నిన్ను తప్పక కలిసికొనును. రాజభటులు తీసికొని వచ్చెదరు, ఇచటనే యుండుము. అడలకుము. నీ పేరేమి?

ఇంది:—నాకుఁ బేరు లేదు.

1:—అదేమి మాట!

ఇంది:—మాసిపోయినది.

2:—అంతకుఁ బూర్వమేమి పేరుండెడిది.

ఇంది:—అది చాల చెడ్డపేరు. వినరానిపేరు. చెప్పరానిపేరు.

1:—పోనిమ్ము. నీపుత్త్రుని పేరెవరు!

ఇంది:—నేనెఱుఁగ—అయ్యో! నాకొడుకు పేరైన నెఱుఁగ నైతి. (విలపించును).

2:—బాగున్నది. నీకొడుకెట్లుండునో చెప్పఁగలవా!

ఇంది:—అక్కటా! అదియు నేనెఱుఁగనే.

1:—అవ్వా! నీసంగతి చాల చిత్రముగనున్నది. నీవేలయేడ్చెదవు! నీకు నిజముగఁ గొడుకు కలఁడా! అతఁడిప్పుడీనగరమందున్నాఁడా!

ఇంది:—అదియు నేనెఱుఁగ (పండుకొనును).

2:—చాలునిఁకరండు. ఇటుపై నీమెతో మాటాడుచుండిన మనకును బిచ్చి యెత్తఁగలదు.

(తెరలో గంట మువ్మాఱు మ్రోగును)

1:—అదిగో! వేళయయినది వపాహోమమునకు. చూడఁగోరువారు రావలసినదని పిలుచుచున్నారు. నేటితో క్రతువుసరి.

[పదునైదేండ్లబాలుఁడొకఁడు తక్క మిగిలినవారందఱును బరుగెత్తుకొనిపోదురు. ఇందిరపరుండియుండి].

ఇంది:—నాకును ఘంటానాదము వినఁబడినది. యమమహిషఘంటానాదము కాఁబోలు. కనుక నేయందఱును నన్ను విడిచిపోయిరి. కాదు. నాకుఁ బిచ్చి యెత్తినదఁట (కన్ను

లుమూసికొని కన్నీరు గార్చుచు) నిజమె. నా యీ కోరిక యెపిచ్చి. దాని బలపఱచిన యాశ యంతకంటెను బిచ్చి. నాబ్రతుకే యొకపిచ్చి ... ... (ఊరకుండును)

బాలుడు:—(దగ్గఱకుఁ బోయి కూర్చుండి) అమ్మా !

ఇంది:—హాపుత్త్రా ! ఎన్ని సంవత్సరములయినదిర నిన్ను జూచి!

బాలు:—కండ్లు తెఱచి నన్నుఁజూడుము. తల్లీ ! నీవిచ్చటికెట్లు వచ్చితివి!

ఇంది: —(ఊరక చూచుచు) నడచి.

బాలు:—ఎక్కడనుండి వచ్చితివి.

ఇంది:—మాయూరినుండియె.

బాలు:—ఎప్పుడు బయలుదేరితివి.

ఇంది:—నాఁడె-ఇంక నీ పిచ్చిదానికి సిగ్గేల ! భయమేల! నా భర్తచే విడిచిపెట్టఁబడినదాననై కన్నకొడుకునకుఁ జను బాలిచ్చుకొనలేక దూరమై పోవుటచే నాగ్రామమందుండుట నాకేనాఁడు దుర్భరమయ్యెనో యానాఁడే బయలుదేరితిని.

బాలు:—అమ్మా! ఆగ్రామమెచట నున్నది.

ఇంది:—నాహృదయమందు. వింధ్యపాదమందు.

బాలు:—తల్లీ! నీవే! నీవే! నీవే! - నాతల్లివి. అమ్మా! (కౌఁగిలించుకొనును).

ఇంది:— నాకుఁ బుత్త్రుఁడు కావలయును. అయినను నన్ను ముట్టకుము.

బాలు:—నాయమ్మ యస్పృశ్యయయినచో నేను నస్పృశ్యుఁడనే. నీవు నరకమునకుఁ బోయినచో నేను స్వర్గమునకెట్లు పోఁజాలుదును. తల్లీ! కోపమునిలుపకుము! నీయక్కునఁజేర్చి యాదరింపుము. అమ్మా! - అహా! ఆపిలుపెంత సుఖముగనున్నది? నాహృదయమునకు మాతృప్రేమామృతముఁ జవిచూపుము.

ఇంది:—తిరిగి యెంతకాలమునకు నిన్ను గంటినిర నాతనయ. (ఆలింగనము చేసికొని నిశ్చేష్టయై మైమఱచును.)

బాలు:—ఇప్పుడుగద నాహృదయము సజీవమగుచున్నది. గగనమెంత వినీలతరమై మనోహరముగఁ గన్పట్టుచున్నది! సూర్యతేజ మిప్పుడెంత శోభాయమానముగనున్నది. ఈసమయమున నీతావున నెవ్వరును లేకున్నను నేనిప్పుడుగదా బహు విశాల సంకీర్ణంబగు నామానవ సంఘముతో మిళితుఁడనై దానియందొక స్థానమును, దానితో నొక యవినాభావ సంబంధమును గలిగియున్నటుల సత్యము ప్రత్యక్షానుభవమగుచున్నది. నాహృదయమున కనిర్వాచ్యమగు తృప్తి, శాంతి, గర్వము గలుగుచున్నవి. ఇప్పుడు గదా తెలియుచున్నది. ఇంతవఱకు నాజీవితమెట్లున్నది. పుష్పమందలి కీటకమునవలె సంఘమునందుండి పొట్ట నింపుకొనుచుంటినేకాని తత్సౌరభ మాఘ్రాణించి, యాయానంద మనుభవింపఁ జాలనైతిని

ఇంది:—(మేల్కాంచి) నాయనా! నీవెక్కడవే వచ్చితివా!

బాలు:—అమ్మా! అగును - నాకు మఱి యెవ్వరున్నారు.

ఇంది:—అట్లనెదవేల! తండ్రీ!

బాలు:—అమ్మా! నేను మఱేమనఁగలను! - ఏమని చెప్ప దును.

ఇంది:—హా! తల్లికి దూరుఁడవై నాయనను గూడఁగోల్పోతివే తండ్రీ! నాకడుపునబుట్టి నీవును దురదృష్టవంతుఁడ వయితివిర కొడుకా! అక్కటా! నాకంటివెంటనొక్క కన్నీటిబొట్టయిన వెడలకున్నది. ఈశోక దవానలము బాష్పధారలనెల్ల నిగిర్చి వేయుచున్నది. ఈ పాడు దేహమునుగూడ నొక్కమాఱుగ దహించి భస్మము చేయరాదా! అట్లేల చేయును. నేసహగమనము చేసె దను. ఉలికిపడకుము. తనయ! అది నాపాపములకెల్లఁ దగు ప్రాయశ్చిత్తము. మాకు నుత్తమగతులఁ బ్రసా దించును. కావున నీవును నామోదింపఁదగినది. నీవడ్డు రాకుము నామనోనిశ్చయమునకు

బాలు:—అమ్మా! నాకీభాగ్యమీయొక్క క్షణమాత్రమేనా (తల్లిపాదములకు నమస్కరించును, మఱి యిఁకనాకేమి దిక్కు! ఏమిదారి!

ఇంది:—కుమార! అట్లు దుఃఖింపకుము. నిరాశ చెందకుము. నీతండ్రి నామసంకీర్తనము మఱవకుము. మీపెద్దల సదాచారముల విడువకుము. చిరకాల మీపుడమిపై వర్ధిల్లుము. దిక్కులేనివారికినిఁ గలదనుకొను వారికినిఁ గూడ దేవుఁడొక్కఁడె దిక్కు. ఆమాట మదివిశ్వసిం పుము. ఇచ్చటి కనతిదూరముననె వాల్మీకి మహర్షి యాశ్రమమున్నది. వారి నాశ్రయించి జ్ఞానమార్జించు

కొనుము. అచ్చటనే జగజ్జనని కలదు. ఆదేవి పాద కమలములకు సాష్టాంగ దండప్రణామము లాచరించి ధన్యుఁడవు గమ్ము. నేనా దేవికడ సెలవుదీసికొనక వచ్చితిని. నాతప్పులనెల్ల మన్నింపుమనికూడ ప్రార్థింపుము. ఇఁక నేఁ జెప్పవలసిన దేమున్నది! నేఁ బోవుచున్నాను. ఒక్కమాట యడుగవలెనని మఱచితిని నీపేరేమి !

బాలు:—రాముఁడు.

ఇంది:—అటులకాదు. నీవు రామదత్తు లేక రామదాసు అని చెప్పికొనుట నాకోరిక. నీతల్లి కడసారి కోరికి నెఱవేర్పవా !

బాలు:—అమ్మా ! నీ తనయు నట్లడుగవలయునా ! నేను రామదానును.

ఇంది:—ఆహా! శ్రీరామచంద్ర! నీ యాగమహిమ ! కోరికలు కలుగుటయే తడవుగ సిద్ధించుచున్నవి! అది హోమధూమముగఁ దోచుటలేదు. కల్పవృక్షమె యీ పావన హోమకుండమున నుద్భవించి వియత్తలమెల్ల నావరించుచున్నది. నేను క్షణకాలములో నానాథునిఁ జేరికొందునుగాక. (వెడలిపోవును.)

రామదాసు లేక బాలుఁడు:—నామాతృదేవత ప్రత్యక్షమయినది - అదిగో - తిరిగి యంతర్హితయగుచున్నది. అమ్మా, నీసాకారమూర్తి కిదియె నాకడసారి వందనము. ఇంతవఱకు "అమ్మ" యను పదము నాకు శబ్దమాత్రముగనుండెను. నేఁడు దానికి రూపార్థభావరస

ములు సిద్ధించినవి. నాతండ్రి మోహమైన నించుక జ్ఞప్తి యుండెడిదికాని నీ రూపము నాస్మృతి పథము నకతీతమై యుండెడిది. భగవంతుని రూపము జ్ఞప్తి లేకున్నను నాకుఁ దెలియకున్నను దేవుఁడు కలఁడని నమ్మితిని. అటులనే నీవును గలవని నమ్మితిని. నిన్ను గూర్చి పలువురు పలువిధములఁ జెప్పఁ దొడఁగిరి. భగవంతుని వలెనే నీవును మానవుని దూషణ భూషణంబుల కర్త్రాలవని విశ్వసించితిని. ఆదూషణ భూణంబులును దేవునివలె నిన్నును సువ్యక్తము చేయుటకు మాఱుగ నాయామానవుల వేఱు వేఱు స్వభావముల నాకు విస్పష్టము గావింపఁ దొడఁగెను. ఈశ్వరుఁడు నిన్ను నీవీశ్వరుని నెఱుంగుదురు. అన్యులెఱుఁగరు. నాకు నేఁడు నీ సాక్షాత్కారము గలిగినది. ఈశ్వర సాక్షాత్కారము గూడఁ గలుగదా! పూజ్యులగు వాల్మీకి మహర్షుల నాశ్రయించెద. కరుణామయి జగజ్జననికి మ్రొక్కుకొనియెద. రామదాసునని చెప్పకొనియెద.

(తెరపడును).

## మూఁడవరంగము.

### యాగనగరమున రాజసభాభవన ప్రవేశద్వారము.

ప్రవేశము - ఇరువురు పురవాసులు.

1:—లంకాపతి నెంత యేమిఁ గొనియాడఁదగును.

2:—ధర్మమే ప్రధానముగఁ గలవాఁడు. కాని సోదరిని దానవ కులమునుండి వెలివేయునా!

1:— శూర్పణఖ నెవ్వరు చంపినను లంకారాజ్యమున నేరము గాదట. తుదకు మంచి శాస్తియయినది.

(సభలోనికిఁ బ్రవేశింతురు.)

[మధురపౌరుల ప్రవేశము.]

1:— శూర్పణఖ మాటకేమిగాని లవణునికిఁ దగిన శిక్ష విధింపఁబడెను. విభీషణునకుఁ బక్షపాతము లేదు.

2:— మఱి నేఁడు సార్వభౌముఁడేమనునో.

1:— వాని క్షమింపఁదగదు. శ్రీరామ సార్వభౌముఁడు పాత్ర మేల క్షమించును! తన ప్రజలు వధ్యభూములఁ దలంపఁడా!

2:— అదియేకదా నేఁడు చూడఁదగినది. ఒకవేళ కనికరించి వానిని క్షమింపఁదలచినను మనమెల్లరము వలదని మొఱపెట్టుకొనవలెను.

1:— అప్పుడే సభయెల్ల నిండి క్రిక్కిరిసి పోవుచున్నది. నడువుము (సభలోనికిఁ బోదురు.)

[ఇరువురు రాజులు ప్రవేశము.]

1:— ఇట్టి సార్వభౌముని చరితము మున్నెన్నఁడును గనివిని యుండలేదు.

2:— ఏమి యశ్వమేధము! ఎంత వైభవము! ప్రజలకాభక్తి, చక్రవర్తికా వాత్సల్యము!. మనలను మిత్రులతో సమానముగఁ జూచుచుండెనేకాని సామంతులుగా నెంచుట లేదుగదా!

1:— ఈ మహారాజునకు శత్రువులయెడ మాత్రమెంత యౌదార్యము! పరాజితులైన వారియెడ సానుభూతి, కని

కరము - సూర్యుని కిరణములనైన లెక్కింపవచ్చును గాని, యీ మహాపురుషుని సుగుణముల లెక్కింప నలవిగాదు.

2:—లవణుని శిక్షించుటేమో నేఁడు.

1:—అట్టి విశ్వాసముతోడనే సార్వభౌమునకు విన్నపమంపుకొని యుందును. అంధకారమందున్న వారెల్ల సూర్య భగవానుని కొఱకెదురుచూచుచుండునటుల విపత్తునందున్న వారెల్ల నీ శ్రీరామచంద్రుని కరుణా కటాక్షములకొఱకు వేఁడుచుందురు.

2:—వామపార్శ్వమున సువర్ణ సీతనుజూడ నాకు దుఃఖమాగినదికాదు.

1:—సీతా మహాదేవి పరమసాధ్వి. శ్రీరామచంద్రుఁడు లోకోత్తర పురుషుఁడు. ఆ ప్రేమ దాంపత్యము నిరుపమానము. దానికదియేసాటి. (సభలోనికిఁ బ్రవేశింతురు).

[లక్ష్మణుఁడు భరతుఁడు ప్రవేశము].

భర:—అన్నగారేమి నిశ్చయింతురో!- వసిష్ఠ భగవానునితో మంతనముఁ జేయుచుండిరఁట.

లక్ష్మ:—అది లవణుని గూర్చియేనా! కడచిన రాత్రియేమో సుఖ స్వప్నము గలిగినదఁట. దానినిగూర్చియే యుండునని కొంటిని. కాని యొకవేళ వానికిఁ బ్రాణభిక్ష పెట్టుదురేమో!

భర:—అట్లయినఁ బ్రజలామోదింతురా! ముఖ్యముగ మధురావాసులు.

(సభలోనికిఁ బ్రవేశింతురు.)

[జనక ఋషి పురోహితునితోఁ బ్రవేశము].

జనక:—క్రమముగఁ గోపమెల్ల కరుణగ మారిపోవుచున్నది. ఆ బాలురు యుద్ధము చేయుచుండఁగఁ జూడ వేడుక కలిగినది. బయలుదేరుద మనుకొనుచుండఁగ వాల్మీకి మహర్షి సంధి గుదిర్చెనని వినవచ్చినది.

పురో:—ఆ ఋషిచంద్రుఁడు పరమభాగవతోత్తముఁడు. కమల సంభవుని కరుణా విశేషమునఁ గవిత్వ సంపదఁ బడసి శ్రీరామచక్రవర్తి చరితమును హృద్యముగ సత్యము నీ షణ్మాత్రము నతిక్రమింపకుండఁగ వ్రాయు చుండెనఁట !

జనక:—అదిగో! సభాభవనమెల్ల జనాకీర్ణమై పోయినది.

పురో:—నేఁడె సర్వది గ్రాజమండలియు సార్వభౌముని పాద పీఠము కడ నిలిచి శిరమువంచి నమస్కరించి సెలవు వేఁడుకొని తమతమ దేశముల కరిగెడు దినము. మఱియు నా రాక్షసునికి లంకాపతి విధించిన శిక్ష స్థిరపఱచి యురిదీయుటయా ! లేక క్షమించి విడుచుటయా! అను నదికూడ నేఁడె తేలునఁట !

జనక:—ఆ రాక్షసునికేమి విశ్వాసము ! విభీషణుఁడు శిక్షింప రాఘవుఁడు రక్షించునని !

(సభలోనికిఁ బ్రవేశింతురు).

(విచ్చుకత్తులతోనున్న రాక్షసభటులనడుమ లవణుఁడు ప్రవేశము)

లవణ:—శూర్పణఖకు విధియించిన శిక్ష వినినప్పటినుండియు నా హృదయమున కెంతయో యానందము గలుగు

చున్నది! ఇంక నా ప్రాణములుపోయినను విచారింపను. హా! శూర్పణఖా! పిశాచీ! నా కాళయను పెనుభూతముఁ గల్పించి, నిరపాయముగ స్వేచ్ఛగ బ్రతుకుచున్న నన్నీవలకు లాగి యెంత తెచ్చిపెట్టితివే! అందుకే నీకు నేను తగిన శాస్తిచేయించితిని. కాని యిప్పు డొక్కసారి నీ మొగమెట్లున్నదో చూచి వెక్కిరించి "స్వయంకృతాపరాధమున కెవరి నేమి చేయుమందువు" అని యడుగవలెనని యున్నది! అందుకొఱకె సిగ్గువిడిచి యభిమానముఁ జంపుకొని హైన్యమునకుఁ బాల్పడి నా గర్భశత్రుని 'శరణు, క్షమింపుఁడ'ని వేఁడుకొనుట కియ్యకొంటిని. కానిమ్ము. నన్నురి తీసినను నా ఛాయనైన వచ్చి నిన్ను కుశల మడుగకపోదు.

1. ర-భ:—ఏమిది! అడుగు ముందునకుఁ బడకున్నది.

2. ర-భ:—నడు నడు. పెండ్లికూతువలె వెనుకఁడుగువేయుచున్నావు. అది నీశోభనవు గదికాదు.

లవణ:—ఏమయినను మనమందఱమా చీకటికొట్టునకుఁ జేరవలసినవారమె (సభలోనికిఁ బ్రవేశింతురు).

[తెరలేచును. సభ యెల్ల యథోచితముగ నిండియుండును.]

(నేపథ్యమున.)

"జయము శ్రీరామ సార్వభౌమునకు జయము. జయము. జయము.

ఆంజ:—ఆనందముతో లేచి యంజలిపట్టును. అందఱు లేతురు.)

లవణ:—నాగుండె లిప్పుడింత వేగముగఁగొట్టుకొనుచున్న వేల! నాకునిజముగ భయము వేయుచున్నటులున్నది. కాళ్లు దడదడలాడుచున్నవి. నిలువలేను (కూర్చుండఁబోవును)

ర-భ:—లేలెమ్ము. నీయాట లిక్కడసాగవు. (కౌదరించును లవణుఁడు నిలుచును)

[ప్రవేశము ! శ్రీరామసార్వభౌముఁడు వసిష్ఠభగవానుఁడు]

వసి:—ప్రజారంజనము !

శ్రీ:—విధియే ! - అయినను త్యాగము తనహక్కు, ఔదార్యము ఒరునిహక్కు గదా ! మహాత్మ !

వసి:—అగును. వత్స ! జాతిపక్షపాతముచే నే నే పొరవడితిని.

[శ్రీరాముఁడు సింహాసనమెక్కి యందఱఁ గూర్చుండ నియమించును. సభ కూర్చుండును]

శ్రీ:—ఇతఁడేనా ! లవణాసురుఁడు !

విభీష:—వీఁడె.

శ్రీ:—ఓయీ దానవ ! నిన్ను క్షమించి మేమిప్పుడు విడిచి పెట్టినచో నీ వెందరుగుదువు. ఏమి చేయుదువు ?

మధురపౌరులు:—వలదు మహాప్రభూ ! బ్రదుకలేము. పులిని బోనునుండి విడిచిపెట్టవలదు.

శత్రు:—ఈ క్రూరుఁడు దేవరకరుణ కెట్లుపాత్రుఁడో ముందుఁ గనుఁగొనవలయును.

సుగ్రీ:—మహారాజ ! శత్రు శేషముంచుటతగదు.

జనక:—లవణునినోట నేమాటయురాదు. ఊరకయుంద అన్ని విధములఁ బలుకనేల ?

లవణ:—నాకొఱ కేడ్పుటకుఁ గాని నేవారి కొఱ కేడ్పుటకుఁ గాని నాకాలుబిడ్డలును వేఱెవ్వరును లేరు. నాకీ భూమి జయించి పాలింపవలెనను నాశకూడ యిప్పుడంతగ లేదు. ఏలయో దుర్బల లక్షణమున నామాట నోటి నుండిజారినది. నాకదియే యెంతయో లాఘవముగ నున్నది. కనుక నీచర్చలుమానివేసి నన్నుఁజంపవలె నని మీకుత్సాహమున్నచో నాకంటె మీకాకోరికఁ దీర్పఁగలవారు మఱెవ్వరున్నారు ? కావున వెంటనే యురితీయింపుఁడు. లేక యీలవణుని ప్రాణములఁదీసి మీ కంఠమునఁ దాల్చుకొనుట యంతసుందరముగ నుండదేమొ యని సందేహముకలదేని విడిచిపెట్టుఁడు. నా యిచ్ఛవచ్చినచోటికిఁ బోదును. నా యిచ్ఛవచ్చి నటుల మెలఁగుదును. కాని యొకటిమాత్రమునమ్ముఁడు. లవణుఁడెంత క్రూరుఁడయినను కృతఘ్నుఁడు కాఁడు.

శ్రీ:—లవణాసురుఁడు క్షమింపఁబడెను. [సభలో కలవరము. వేత్రహస్తులు వారించుచుందురు ]

వసి:—హద్దుమీరఁబోకుఁడు. ఇది సార్వభౌముని సభాస్థలి.

శ్రీ:—(లేచిహస్తమునెత్త నంతయు నిశ్శబ్దమగును. పిదప ప్రజలదిక్కుదిరిగి) ఊరక కలవరమేల ! లవణుఁడేల యురితీయఁబడవలయునో యోచింగింపుఁడు. లవణుఁడు మనరాజ్యములోని వాఁడుకాఁడు. మనకు మిత్రుఁడు కాఁడు. శత్రువు యుద్ధముచేయవచ్చెను. యుద్ధము గావించెను. ఆయవసరమున మనల మిక్కిలి కష్టముల పాలు గావించెను. నిజము. అందులకాతఁడు రణరంగ

మునసే వధింపఁబడవలసినది. కాని న్యాయస్థానమున విచారింపఁబడి యురితీయఁబడదగిన వాఁడుకాఁడు(విభీష ణుని దిక్కు దిరిగి) మఱియాతఁడీ లంకాపతిరాజ్యము నకుఁ జెందినవాఁడు కావున వారిన్యాయస్థానమునం దేల విచారణకులోనై శిక్షింపఁబడరాదందురా! మిత్రమా! విభీషణా ! నీసోదరుని భక్తులను భయముచే లోఁగఁ దీసికొనుటకంటె నయముచే వశపఱచుకొనుటయే యుత్తమమార్గమును శ్రేయోదాయకమును రాజనీతి యును. శత్రులుకుటిలవర్తనులగుట ఋజువర్తను లగుట కంటె నుపద్రవకరము. (తనప్రజదిక్కు దిరిగి) మన మిప్పుడు లవణుని విడచుట పులినిబోనునుండి విడచుట యనియా మీరు తలంచుచుంటిరి ! అగుగాక. అట్లనే తలంతము. అయినను ఆ పులి మఱల గ్రామములపైఁ బడి చెలరేగుచో. మనము తిరిగి దానినిబట్టి బంధింప లేమా ! ఒకవేళ మనకట్టిశక్తియే చాలదని తలఁతు రేని - మఱియొక పులివచ్చి మనమీఁదఁబడిన - అప్పుడు మనముచేయఁగలుగునది యేమి ! (రాజలోకమువంకఁ దిరిగి) ఈ క్రూరుఁడేల శిక్షింతవ్యుఁడు, కరుణాపాత్రుఁడు అన్న సమస్యకూడ వెలువడినది. పరాజితుఁడై, యే కాకియై, మీ ముందు నిలిచియున్న వానిని వధింపఁ దగునా ! కనికరింపవలదా ! చతురంగమాడునప్పుడైన జంతువులేక నిస్సహాయుఁడై యున్న రాజును జంపరాదం దురే ! ఆధర్మమునకు వేడుకయాటలందు మాత్రమే వినియోగమా! మిమ్ముఁ బలుబాములఁ బెట్టిన యొకజీవి

మీచేఁజిక్కి దానిజీవమరణములు మీయిచ్ఛాధీనము లై యుండునపుడుఅద్దానినిఁ జంపుటకంటె విడుచుటయే యార్యధర్మము. మీపడ్డబన్నముల మీరొడఁగూర్ప నెంచిన ప్రాణనష్టముతోఁ బోల్చిచూడుఁడు. మీ రాకష్టముల నెల్లనోర్చుకొనఁ గలిగితిరి. గట్టెక్కితిరి. జయించితిరి. మీకష్టములుతీరినవి. ప్రాణనష్టమెట్టిపట్టి కైన దీరునదా! నిదానముతో బరిశీలింపుఁడు. ఆత్మ పరీక్షగావింపుఁడు. సర్వేశ్వరుఁడు సర్వశక్తిమంతుఁడు గావున మీరు చేసినదోషములకు మిమ్ములనిటులనే నాశనముచేయుట మీకిష్టమగునా! "పరమేశ్వర! కరుణానిధి! నన్నుక్షమింపుము!" అని మనము వేఁడు కొనుటలేదా! ఆకరుణ మన మితరులయెడఁ జూప నపుడు మనయెడ నీశ్వరుఁడేలచూపవలయు! నిదా నింపుడు! జనులార! పరిశీలింపుఁడు.

లవణ:—ఏమి వినుచుంటిని! నాకీలోకము క్రొత్తగఁ గనఁ బడుచున్నదే! లోకాంతర మరిగితినా! జన్మాంతర మందితినా!

మధురహా:—కించిద్‌జ్ఞులము. పొరపడితిమి. రాగద్వేషములఁ బడి కొట్టుకొనువారమై తెలియకపోతిమి. మన్నిం పుఁడు. రక్షింపుఁడు. లవణునిఁ గరుణింపుఁడు.

వసి:—వత్స! రామచంద్ర! నీవు గురువులకు గురువవగు చుంటివి.

భర:—ఇంకను ఆ రక్షకభటులేల! (రక్షకభటులు తొలఁ గుదురు.

విభీ:—లవణా ! పొమ్ము. బ్రదికితివి. ఇకనైన సన్మార్గ మను సరింపుము.

శ్రీ:—ఏమికావలయును ! అటులఁజూచుచు నిలిచెదవేల ?

లవణ:—నాకేమి కావలయును ! ఏమియు నక్కఱలేదు. ఎంద రుగుదును ! ఇచ్చటనేయుందును - కాదు పోయెదను - ఒకనాఁడు రాఘువరక్తపిపాసాపేక్షితమగు కరవాలము ముట్టి శపథముఁ జేసితిని. అయినను శ్రీరామసార్వ భౌమ! నేజయింపఁబడితిని. దయాళూ ! నీకరుణ నా రాక్షసత్వమునే జయించుచున్నది. అచిరకాలముననె యీశ్వరానుగ్రహమువలన - బాలురు, సలక్షణులు, సుందరులు, సుశిక్షితులు, సత్ప్రవర్తనులు, నద్వితీయ శౌర్యధైర్య పరాక్రమ స్ఫురణులు నగు పుత్త్రులం గందువుగాక. మఱినాకేమి కావలయును. సెలవు. (వెడలిపోవును.)

వసి:—సాధు ! లవణా ! సాధు ! (శ్రీరామజనకులవంకఁ జూచును.)

జనక:—అవిశ్వసనీయము. అట్టి యదృష్టమా ! హా రామ ! హా సీతా !

శ్రీ:—(సింహాసనమునకుఁ జేరఁబడి కనులమూసికొని ధ్యానిం చుచుండును.)

విభీ:—లవణునిఁ బిలుచుకొనిరండు. మఱికొన్ని మాటలడుగు దము. సర్వము విశదమగును.

సుగ్రీ:—హృదయపూర్వకమగు నాశీర్వచనమది.

(నేపథ్యమున వీణాగానము)

ఆంజ:—రామనామమువలె నెంతశ్రావ్యమై యెంత హృద్యమై మనోహరమై విలసిల్లుచున్నది ! ఆగానము ! కష్ట దుఃఖ తరంగ కల్లోలక్షుభితమగు నీ లోకమునకుఁ బ్రశాంతనిర్మలతన్మయతఁ గలిగించుచున్నది. తంత్రీ స్వనమును మించిహృదయోల్లాస కరమై వినవచ్చుచున్నదే ! ఎవరో ఆ బాలురు ! శ్రీకరకంఠసుస్వనము. (అందఱును గాన మాలింతురు. గాన మాగిపోవును. కుశలవుల ప్రవేశము.)

కుశు:—శ్రీరామసార్వభౌముని సందర్శనమునకు వచ్చితిమి.

చంద్ర:—వీరె మనయశ్వము బంధించి యద్వితీయ పరాక్రమముఁ బ్రదర్శించినది (అని కుశలవులదగ్గరి కౌఁగలించుకొని) మిత్రులకు స్వాగతము.

ఆంజ:—సోదరులన మిక్కిలి యొప్పియుండును.

లవు:—అన్నా ! వారుగోజనకులు. నాఁడు మన యాశ్రమమునకు విచ్చేసియుండిరికదా !

కుశు:—అగును. కాని మిత్రమా ! చుక్కలనడుమ నిండు చందురునిఁబోలి ప్రకాశించుచున్నవారెకా మనసార్వభౌములు !

లవు:—ఆహా ! శ్రీమద్రామాయణమునకుఁ దగిన కథానాయకులు.

(చంద్రకేతువు కుశలవులఁ జక్రవర్తికడకుఁ గొనివచ్చును.)

సుగ్రీ:—ఆంజనేయ ! చూడుము. ఆనడకలీరు. ఆపోలిక. ఆ మాటలపొందిక.

ఆంజ:—అటులనే తోచుచున్నది. (కుశలవులు శ్రీరామునకు వంగి నమస్కరింతురు.)

శ్రీ:—(ఏమియు నాశీర్వదింపక బాలురనెత్తి కౌఁగిలించుకొని) చిరంజీవు లయ్యెదరుగాక. బాలసూర్యచంద్రుల వలె లోకానందకరులు. ఆచంద్రార్కము వర్ధిల్లుదురుగాక.

వసి:—బాలకులార! మీనివాసమెచ్చట!

లవు:—మామిత్రుఁడు చంద్రకేతువుక్క వాక్యములోసర్వము నెఱింగించెనే. మీకుఁ దెలియలేదా మేము వాల్మీకి మహర్షి యాశ్రమమందలివారమని?

శ్రీ:—(స్వగతము) వీరల నెన్నియో యడుగవలెనని యున్నది. అడిగిననేమి సమాధానము వచ్చునోయని జంకును గలుగుచున్నది. హృదయమూరక ముందు వెనుకల కూగులాడుచున్నది.

లక్ష్మ:—మీరెవరియొద్ద విద్య నభ్యసించితిరి.

కుశు:—విద్యాభ్యాసము పూర్తికాలేదు. వాల్మీకి మహర్షులే మాకు గురువులు.

లవు:—అన్నా! మనము బాగుసేయుచున్నాము.

చంద్ర:—సఖా! ఇచ్చటికంటె యడవులలోనిమీ మునిపల్లెలే మీకు బాగుండునా! మొదటినుండియుఁ దొందరపడు చుంటివి.

లవు:—ఇందు మాకుఁ గ్రొత్తగ నున్నది.

భర:—మీరు క్షత్రియ బాలురవలె నున్నారే. మునిపల్లెల యందేల వసించుచుంటిరి.

కుశ:—మేము మొదటినుండియు నక్కడనే పెరిగితిమి.

శత్రు:—మీ రిరువురు సోదరులా! మీలో జ్యేష్ఠుఁడెవరు!

లవు:—మాయన్నకుఁ బిల్లనిచ్చి పెండ్లి సేయుదురా యేమి చెపుమా యిపుడు సార్వభౌమ!

వసి:—మీకిరువురకుఁగూడ శుభముకలుగఁగలదు నేఁడు చక్రవర్తి యనుగ్రహమున.

ఆంజ:—ఈకోతిగాని ప్రశ్నమున కుత్తరముఁ జెప్పుటయాయని నిరసింపకుండు రేని నాకు నొకమాట యడుగవలెనని యున్నది. మిముగన్న తల్లిదండ్రుల పుణ్యనామము లెట్టివో గద.

లవు:—నీవును మానవభాషఁబలుకుచుంటివే. నీపేరేమి!

ఆంజ:—హనుమంతుఁడందురు. నేనడిగిన ప్రశ్నమీపై నప్పయియున్నది.

లవు:—మాయమ్మనందఱు నమ్మయందురు. అంతియ మే మెఱిఁగినది.

జనక:—మీకు గానమందుఁగూడ మంచి ప్రవేశమున్నట్టు లున్నది.

శ్రీ:—(లవునిఁ జేరఁదీసి) అబ్బాయి! ఏది! నీవొక్క చిన్న పాటఁ బాడుము. ఇక్కడికి వచ్చుచున్నప్పుడు పాడుచుంటివే. దానినే పూర్తిచేయుఁడు. మాకెంతయు వినముచ్చటగుచున్నది.

విభీ:—మహారాజ! వీరిసంభాషణమె సంగీతమువలె మనోహరమగుచున్నది.

లవు:—పాటకచ్చేరీలఁ జేయ మేము గాయకులము గాము.

కుశు:—శ్రీరామ సార్వభౌమ ! రఘువంశధురంధర !

శ్రీ:—(స్వగతము) నేఁడు తిరిగి యీ మాట యీ బాలుర నోటినుండి వెలువడి నాహృదయము వ్రక్కలు చేయు చున్నది.

కుశు:—మేము గురుశాసనము శిరమునఁదాల్చి మా చే దేవర యాగాశ్వము బంధింపఁబడిన యపరాధమును మన్నింపుఁడని మా చక్రవర్తిని వేఁడుకొనుటకు వచ్చితిమి.

(అని కుశలవులు వంగి నమస్కరింతురు.)

శ్రీ:—క్షమింపఁదగదు. క్షమింపఁదగిన దేదియుఁగాన రాకున్నది.

సుగ్రీ:—గౌరవింపవలయును.

భర:—గారవింపవలయును.

శ్రీ:—మనచంద్రకేతుని మిత్రులను జంద్రకేతునితో సమముగ గారవింతము.

(తన మెడలోని హారములనుదీసి వారిమెడలో వేయును.)

కుశు:—మమ్ము మిక్కిలి యాదరించుచుంటిరి. మోమోట మగుచున్నది !

సార్వభౌమ ! మాకు సెలవిప్పింపుఁడు.

చంద్ర:—మీరు మొదటినుండియుఁ దొందరపడుచు నే యుంటిరి.

లవు:—అమ్మ మాకొఱకెదురు చూచుచుండును.

చంద్ర:—తడవైనను రాజసన్మానముగాంచి యానందించును.

(అంతఃపుర పరిచారిక ప్రవేశము)

పరిచా:—జయము, సార్వభౌమ, జయము! కౌసల్యాదేవి గారిపుడు గానము చేయుచు వచ్చిన బాలురను జూడ గోరుచున్నారు. కొనిరమ్మని నన్నంపియున్నారు.

శ్రీ:—అమ్మగారేమి చేయుచున్నారు.

పరిచా:—అమ్మగారు, నరుంధతీదేవిగారును గలిసికూర్చుండి మాటలాడు కొనుచున్నారు.

శ్రీ:—బాలకులార! వింటిరిగద! పూజ్యులగు వృద్ధులు మిము జూడఁగోరుచుండిరఁట!

కుశు:—తమ్ముఁడా! ఒకసారియటుపోయి పెద్దలదర్శనముఁజేసి కొనివత్తము.

లవు:—అది కర్తవ్యముకద! మహారాజ! పోయివత్తుము (పరిచారికతో నిష్క్రి)

శ్రీ:—(స్వగతము.) మహారాజ! మహారాజ! మహా రాజ! నన్నెవ్వరు నాన్నాయనిపిలువరు కద! ఈ బాలురఁ గన్నతల్లి దండ్రులే తల్లిదండ్రులు. వారి యదృష్టమే యదృష్టము.

(వాల్మీకిప్రవేశము. అందఱును లేచి గౌరవింతురు.

శ్రీ:—ఋషిసత్తములకు నమస్కారము.

వాల్మీ:—సకలమనోరథ సిద్ధిరస్తు.

వసి:—వత్స! అదియమోఘవాక్యము మనకది వరప్రసాదము.

శ్రీ:—అనుగ్రహింపఁబడితిని.

జనక:—భగవానుల దర్శనము గోరి భవదాశ్రమమునకు వచ్చియుంటిని.

వాల్మీ:—అగును. వింటిని. కార్యార్థినై భరతమునినిఁ జూడఁ బోతిని. ఆ కార్యఫలిత మేకద నన్నిప్పు డిచ్చటికిఁ దీసికొనివచ్చినది.

శ్రీ:—ఆనతీయవలయును.

వాల్మీ:—నేఁడు మాపుణ్యవిశేషంబున సార్వభౌమ! నీవశ్వమేధమిచటఁ జేయసంకల్పించుటయు, నాకారణంబున దిగంతంబులనుండియు మహనీయు లెల్లరును మా వనంబుఁ ద్రొక్కి పావన మొనరించుటయు నను భాగ్యములు మాకబ్బినవి. ఏతద్గౌరవసూచకంబుగ నొక రూపకము నప్సరసలచే నేఁటిరాత్రియే ప్రయోగింపఁ జేయ సమకట్టితిమి. మీరెల్లరీ మహాసభయేసభగ నచ్చటికి విచ్చేసి యీనాటకమును సందర్శించి మమ్మానందపఱచెదరు గాక యని కోరుచున్నాను.

లక్ష్మ:—నాటక మందలి కథ యేమి.

వాల్మీ:—సార్వభౌముని చారిత్రమె.

భర:—ఎవరు రచించినది.

వాల్మీ:—సర్వము సుబోధము కాఁగలదు.

శ్రీ:—అవశ్యము వచ్చెదము.

అంద:—మనమెల్లర మరిగి మహర్షుల వేడ్క దీర్పఁదగినదిగద;

సుగ్రీ:—కథయన్న శ్రీరామ చంద్రుని చారిత్రము-మహర్షి పుంగవులు సమకూర్చి యుంచినదఁట! అప్సరసలు ప్రదర్శింతురఁట! మఱివేఱు దృశ్యముగలదె !

విభీ:—మనమందరము నేఁటి కాగవలసినదే.

వాల్మీ:—పోయివచ్చెదము. మా కుశలవులేరి. ఇంక నాశ్రమమునకుఁ బోలేదా.

శ్రీ:—అమ్మగారు చూడఁగోరి వార్తనంపిరి. వారికడ కరిగియుండిరి. తమ వాత్సల్యమునఁ గదా మాయాగము నిర్విఘ్నముగ సాగినది.

వసి:—సమయమునకు వచ్చి సంధిచేసితిరి. లేనిచో నీవేళకు మహాప్రళయమై పోయెడిది.

చంద్ర:—మహాత్మా! ఆయస్త్రముల పేరేమి!

వాల్మీ:—జృంభకాస్త్రములు.

శ్రీ:—తమ రుపదేశించియుంటిరా!

వాల్మీ:—జన్మతః వారికి సిద్ధించినవి. అదియే నాకు నాశ్చర్యము గలిగించినది.

విశ్వా:—మాచే రామచంద్రునకు మాత్రమె ప్రసాదింపఁబడినవి. ఈ బాలుర కెటుల సంక్రమించియుండునో!

వాల్మీ:—తెలియవలయు. పోయివచ్చెదము.

(నిష్క్రమించును.)

:—సభముగించెదము.

(అందఱు నిష్క్రమింతురు.)

(తెరపడును.)

---

# షష్ఠాంకము.

## మొదటి రంగము.



ఒకహాలు.

(ప్రవేశము - శ్రీరాముఁడు.)

శ్రీ:—భ్రాంతియా! కానేరదు. నాయంతరాత్మయె సాక్షి. హృదయేశ్వరినే కాంచినటుల నా హృదయ మానంద మునఁ దాండవించినది. చూచుచున్న కొలఁదియు నకారణముగఁ గరుణయు ననురాగము, నుప్పొంగినవి. తలఁచుకొనిన కొలఁదియు వాత్సల్యముముప్పిరిగొను చున్నది. రాముని హృదయ మూరక యట్లేల పరు విడును! "అమ్మనందఱును" అమ్మా "యందురఁ"ట అంతియ వారెఱింగినది! అక్కటా! జృంభకాస్త్ర ములు తమంతనె వచ్చి చిరంజీవులఁ బొందినవఁట! - నాఁడు "నీప్రసూతిని దప్పక చేరి సేవించు" నంటిని గదా! అగ్నికణమువలె నాస్మృతిపటము నామానస మును దహించి వేయుచున్నది. కుశలవులు నీపుత్త్రులు- నీపుత్త్రులు-అని ప్రకృతియెల్ల నొక్కి వక్కాణించుచున్నది. నదోష్ఠి ధించుచున్నది. ఐన నీశ్వరాజ్ఞ యెటులున్నదో కద!

(ప్రవేశము - కౌసల్య)

శ్రీ:—అమ్మా! రాముఁడు నమస్కరించుచున్నాఁడు.

కౌస:—కుమార! చిరంజీవివగుము. అంతకంటెఁ గోరఁదగినది తల్లి కేముండును!

శ్రీ:—ఇప్పటికే నా జీవితము దుర్భరమగుచున్నది. రాముఁడు క్రుంగిపోవుచుండెను. రాజు మాత్రమెటులనో రాజ్యము వహించియుండెను. అమ్మా! నాకు మిక్కిలి యలసట కలుగుచున్నది! తిరిగి బాలుఁడనై నీయొడియందుఁ బండుకొనిన నాకుఁ గొంత విశ్రాంతి కలుగును.

కౌస:—నీవు మఱల బాలుఁడవై నాయొడియందుఁ గూర్చుంటి వనియే తలఁచితిని. త్రివేణియందు గంగా యమునల వలె నాబాలురయందు నాగారాబు సీతారాములు ప్రత్యక్షమగుచుండిరి. తనయ! నీవింక నాపరమసాధ్విని శంకించుచుంటివా!

శ్రీ:—అమ్మా! నేను నీరాముఁడనుగానా! పరమేశ్వరుఁడె సాక్షి. నీపాదకమలముల సన్నిధిని బలుకుచుంటిని. ఈ రామునకు మనసునందైన నట్టి పాపపుఁ దలంపు మున్నెన్నఁడుఁ గలిగియుండ లేదు. కలుగనేరదు.

కౌస:—అయినచో!

శ్రీ:—పావనమగు హవిస్సును దేవతలకొఱకు హుతవహుని యందు హోమము చేసినటుల - రాజధర్మము కొఱకు - అర్థాంగినరణ్యముల కర్పించితిని.

కౌస:—మంచిపని చేసితివి.

శ్రీ:—ప్రజానురంజనమె.

కౌస:—మేలు. స్త్రీయనిన నీయభిప్రాయమేమి! పురుషున కాదుది యొక యలంకారమాత్రముగాదు. ఇంద్రియ

ములయాఁకలిదీర్చు నొకవింత యాహారముగాదు. లేక నిర్జీవమగు జంత్రపు బొమ్మకాదు. స్త్రీయొక వ్యక్తి. విశ్వపరిణామమున కాదిశక్తి. ధర్మాచరణం బునఁ బురుషునకు సహధర్మచారిణి. అట్టి ధర్మపత్ని యనుమతిఁ బడయనిచో, ధర్మసిద్ధియే లేదుగద! నీవు కేవలక్రూరకర్ముఁడవైతివి.

శ్రీ:—(స్వగతము.) ఏది యాధారముసేసికొని యింతవఱకు గొంతయేని నూరటజెందఁ బ్రయత్నించుచుంటినో యాయాధారముగూడ నిప్పుడు తీసివేయఁబడినది.

(నేపథ్యమున గానము.)

కౌస:—భగవతి యరుంధతి కుశలవుల బుజ్జగించి యెటులనో పాడించుచున్నది. విందమురమ్ము.

(నిష్క్రమింతురు)

---

రెండవరంగము.

ఆశ్రమ ప్రాంగణము.

సీత:—ధన్యురాలు ఇందిర. నాకు మార్గదర్శిని యయినది. పిల్లలు తండ్రిని జేరిరికద! ఇటుపై నీసీత యెంత కఠిన హృదయయైనను జీవింపఁజాలదు. నాకిఁక జీవింపవల సిన విధిలేదు. పతియే నాదైవమని నమ్మియున్నదాన నగుట సత్యమయేని తల్లీ! భూతధాత్రీ! నన్ను నిశ్శంకముగ నీలోనికిఁగొని.—

[వాల్మీకి ప్రవేశము.]

వాల్మీ:—ఆగుము ! బిడ్డా ! ఏమి పలుకుచుంటివి !

సీత:—ఈ పుడమిపై సీత యింకనుండుట యనావశ్యకము. నేఁబోవుచున్నాను.

వాల్మీ:—ఎక్కడికి !

సీత:—ఎక్కడినుండి వచ్చితినో యక్కడికే పోవుచున్నాను.

వాల్మీ:—ఆత్మహత్య పాపము.

సీత:—అగునఁట !

వాల్మీ:—ఆత్మహత్య గావించుకొనిన జీవి మిగుల యాతనలఁ పాలగును.

సీత:—మహాత్మా ! ప్రాణనాథునిచేఁ బరిత్యజింపఁబడినదాన నగుట నీసూర్యరశ్మి నన్ను శోషింపఁ జేయుచుండెను. వాయువులు చురచుర సోకుచుండెను. ఈ గగనభారా మణచి వేయుచుండెను. కొమ్మనుండివేఱై నేలరాలిన పుష్పము నశించుటయే సహజముగద !

వాల్మీ:—నేనొక హితము చెప్పెదను.

సీత:—ఆనతీయుఁడు.

వాల్మీ:—నేఁడు నాటకమునకు రమ్ము.

సీత:—రాఁజాలను. నాకా, నాటకములు, వినోదములు !

వాల్మీ:—అమ్మా ! వినోదమునకైన రమ్మందునా ! నీకు దానివలన శుభము చేకుఱవచ్చును. నీభర్తృ సందర్శ నముగలుగును. పుత్త్రులఁజెరియొకవై పునఁ గూర్చుండఁ బెట్టుకొనియున్న భర్తను జూడఁగోరుదువేని రమ్ము. నీ

తండ్రియు, నత్తలును, మరదులును, అందఱు నచటికి వచ్చియుందురు.

సీత:—కావుననే రాఁజాలను.

వాల్మీ:—నీవ్వెరుల కగుపడకుండులాగున నేర్పాటు గావించెదను. ప్రదర్శనీయము నీ ప్రాణనాథుని దివ్యచరితము.

సీత:—హతభాగ్య కడియాసలఁ గల్పింపకుఁడు.

వాల్మీ:—నీకీశ్వరునియందు విశ్వాసముకలదా!

సీత:—నా ప్రాణేశ్వరుఁడే నాకీశ్వరుఁడు!

వాల్మీ:—అయినచో వేఱు చింతలమాని నావెంటరమ్ము. నీవు మాఱుపలుకఁదగదు. (ముందునడచును.)

సీత:—అటులనే విధేయను. (వెనుకనడచుచు) హృదయమా! ఏమిది! భయమా! ఆనందమా! పిచ్చియా!

[తెరపడును.]

మూఁడవరంగము.

నాటకమందిర ప్రాంతము.

[ప్రవేశము:—లవణుఁడు, శూర్పణఖ]

లవణ:—ఓహో! శూర్పణఖాదేవియా! కుశలమా!

శూర్ప:—లవణుఁడా! బ్రతికియుంటివా!

లవణ:—నీకుఁదగిన ప్రాయశ్చిత్తమయినదా!

శూర్ప:—అయినది.

లవణ:—ఇంకనిక్కడ మసలెదవేమి! ఏయారణ్యములకైనఁ బోయి తలదాచుకొమ్ము. ప్రాణములపై నాశలేదా యేమి!

శూర్ప:—లేదు.

లవణ:—అయినచో నాటకమునకు వచ్చెదవా యేమి! అక్కడ నీవధ యొకయంతర్నాటకమగును.

శూర్ప:—వచ్చెదను.

లవణ:—ఈతల బిరుసు తనము గట్టిపెట్టుము. చింత చచ్చినను పులుపు చావకున్నది.

శూర్ప:—నాకుఁ దల బిరుసుతనము లేదు. పోయినది.

లవణ:—అట్లయిన రమ్మి. కలసియే పోవుదము.

శూర్ప:—నీవు ముందరుగుము. నే వెనుకవచ్చెదను లే.

లవణ:—వచ్చితివో. చచ్చితివో. అందఱును నావలె నిన్ను జాలిగొని విడుతురను కొనకుము. నామాట వినుము. ఎందైనఁబోయి తలదాచికొనుము. చచ్చిన పిదపనేమున్నది నీకు మట్టి! (వెడలిపోవును.)

శూర్ప:—నిజము. పారిపోదునా! ఎక్కడికిఁబోఁగలను; నాగస్వరముచే నాగుబాము వలె - ఆరూపమాధుర్యముచే గట్టువడితిని. సమ్మోహితనైతిని. అంధురాలనైతిని. లోకమునకంతకు నాసుందరమూర్తి యొక్కటియె కానఁబడుచున్నది. విశ్వమెల్ల తేజము నంధకారము వలె నీరూపమునందు విలీనమై మాయమగుచున్నది! ఈ శలభ మీ సుందరజ్యోతి యందాత్మ నాశముగావించు కొనునుగాని దీనివిడిచి దూరముపోఁజాలదు. ఎఱుఁగుదును. పిచ్చిదాననగు చుంటిని. కాని నిన్ను నాకన్నుల విందుగఁజూడక నిలువఁజాలను. నిన్నుజూచుచు నిద్రాహారముల మఱచి సుఖముగఁ బ్రాణములనైన విడువ

గలను. ఓరామ! ఈ పిచ్చిదానివలె నిన్నెవ్వరుం బ్రేమించియుండరు. ఇటులఁ బ్రేమించుచున్న యబలను నీవు దక్కనన్యులు నిరసింపఁగలిగియుండరు. హా! పాపపు విధి యెటులఁగూర్చెను! ఓరామ! జగదభిరామ! ఇందీవరదళశ్యామ! ప్రఫుల్లకమలేక్షణ! పురుషావతంస! రూపవిభవవిలాస! రూపజితమన్మథా! విశ్వమోహనదీపక! ప్రకృతిమనోహర! రామ-రామ-రామ-రామ! నిన్నుఁ జూచుటకును నీచరితము వినుటకు, నిదిగో మృత్యుముఖమునఁ బ్రవేశించుచున్నాను. లవణా! నాటకమునకు నేనును వచ్చుచున్నాను చూడుము.

(వెడలిపోవును) (తెరపడును.)

## నా ల్గ వ ర ం గ ము.

తమసాతీరమున నాటకరంగము.

(సభయెల్ల యథోచితముగ నిండియుండును. అంతర్నాటకమున సూత్రధారుఁడు ప్రవేశము.)

నాంది.

ప్రకృతిపురుషదాంపత్య స్వరూపముగు నర్ధనారీశ్వరుఁడు
మిమ్ముఁ బ్రోచుఁగాక.

సూత్ర:—(పుష్పాంజలిఁజల్లి) పూజ్యులగు వాల్మీకి భగవానులు మునిసత్తములతో యోగిపుంగవులతో, మహారాజులతో నిండి యుండిన యీసభ ముందల నిట్లు తెల్పుమని

నాకాజ్ఞాపించియుండిరి. "మేము యోగదృష్టిచేఁజూచిన దానిని జూచినటుల రచించితిమి. కావునఁ బ్రమాణబుద్ధితోఁ దుదివఱకుఁ దిలకింపఁదగు నీ రూపకము" అని. మారిషా !

మారి:—బావా ?

సూత్ర:—సర్వము సిద్ధమా ?

మారి:—ఎందులకు ?

సూత్ర:—ఎందులకని క్రొత్తవానివలె నడిగెదవేమి! శ్రీరామనాటక ప్రదర్శన ప్రారంభమునకు.

మారి:—సీతామహాదేవి నాటకమను కొనుచుంటినే.

సూత్ర:—నీగొప్ప తెలివి నంతను నొక్కమారు కనఁబరచితివి కదా! జీవాత్మ పరమాత్మలకుఁ బోలె సీతారాముల కభేదమని యెఱుఁగవా !

మారి:—మందబుద్ధినిగద ! కష్టసుఖముల కడ్డుపడి భేదించుకొనుచు ముక్తిపథమునఁబోవు జీవాత్మవలె మహావేదనతో, రాఘవసామ్రాజ్య పట్టమహిషి, పూర్ణగర్భిణి, జానకి, వనవీధి నదిగో యక్కటా! ఏకాకినియై యెటులఁ బోవుచున్నదో ! గుండె నీరగుచున్నది !

(వెడలి పోవును).

(యథావర్ణితంబుగ సీతప్రవేశము.)

సీత:—ఇఁక నొక్క యడుగైనను బెట్టఁజాలను. పాదములు రెండును ముండ్లతో నిండియున్నవి. కఱకురాలకుఁదగిలి, పగిలి నెత్తురు కారుచున్నది. (కూర్చుండిపైఁట చెఱఁగుతోఁ బాదములొత్తుకొను చుండును.)

లవు:—అమ్మ కాదా !

కుశు:—అట్టి చీనాంబరము లెక్కడివి! కంఠముగూడ వేఱుగ నున్నది. అయ్యో ! ఆమె యెవరు.

శ్రీ:—రాఘవ సామ్రాజ్యపట్టమహిషి! సూత్రధారుఁడు చెప్పి యుండలేదా !

సీత:—అయ్యో! ఇంకను నాకీశరీరపోషణ మెందులకు ! అశోకవృక్షము క్రిందబందినై యుండియునాఁడు ప్రాణ నాథుని సందర్శనము కలుగదాయను నొక్క యాశా పాశముచేఁ బ్రాణము లెటులనో యీ బొందికంటఁ గట్టఁబడి నిలిచియుండినవి. కాని నాకేమున్నది నేఁడు! నిరాశ! అపకీర్తి! వ్యర్థదుఃఖ భాజనకష్టజీవనము. అయి నను నాహృదయేశ్వరుని తేజము నాయందు నిక్షిప్తము గావింపఁబడియున్నది. కావున నాధనముఁదిరిగి స్వామి కర్పించుకొను వఱకు నేనీ దేహము విడిచి పోవుటకు స్వతంత్రను గానుగద ! నాలుక యెండి పిడచవారు చున్నది ! ఎక్కడను జలము కానరాకున్నది. పిచ్చి ! నీ నామామృతముకంటె జలములు నాకెక్కడు నేద దీర్చి తృప్తినీయఁగలవా! రామా! రామా! రామా! (అనిచేరఁబడి యరగన్ను వెట్టి చూచుచుండును.)

(నేపథ్యమున.)

ఏమి యీవిచిత్రము ! ఇట వనమెల్ల నొక్కమారుగ వర్షించు చున్న దేలొకో మధువు ! ఘోరవన్యమృగంబు లీస్థల ముచిడిచి సూర్యునిగాంచిన యంధకార పుంజంబుల వలె నెక్కడికో నిశ్శబ్దముగఁ బారిపోవుచున్నవి !

(సైన్యాధ్యక్షు వేషముతో లవణుఁడు భటుఁడు ప్రవేశము.)

భటు:—ప్రభూ! ఎవ్వరో తపస్సుచేసి కొనుచున్నారు.

లవణు:—కాదురా స్త్రీ.

భటు:—ఆహా ! ఏమి యీ సౌందర్యము. ఏలిన వారదృష్ట వంతులు !

లవణ:—తుచ్ఛ ! మాతరా !

భటు:—ఎవ తెయో వడగొట్టి పడిపోయినది. మన కేల పోదము రండు.

లవణ:—(పరికించిచూచి) రాముని యిల్లాలు సీత. జలముఁ దెమ్ము. ఒక్కమారు పలుకరించి పోదము. (భటు డందీయ జలము సీతముఖముపైఁ బోయును.)

సీత:—(తెప్పిరిలుచు) రామ ! దాహము.

లవణ:—(జలపాత్ర చేతి కిచ్చును.)

సీత:—(త్రాగికనువిచ్చి) మీర లెవ్వరో పుణ్యాత్ములు. ప్రాణ దానముఁ జేసితిరి !

లవణ:—నేను లవణాసురుఁడను. నీనామ ముచ్చరించుచునే మాప్రభువు ప్రాణముల విడిచెనుగద. తుదికి నీవు పలవరించెడి పాతివ్రత్యమునకు ఫలమిది కదా యైనది! అనుభవింపుము. నీమూర్ఖతకుఁ దగిన ప్రాయశ్చిత్తమ యినది. ఇంకను నీవా డొంకయందుఁ గూర్చుండి నీ గీముసే స్మరించుకొను చుండుము. నీకు బాగుగఁ బశ్చాత్తాపము కలుగవలె. నిన్ను మేము చంపము. జీవింపుము.

(నేపథ్యమున శంఖారావము.)

భటు:—విజిగీషువై వాహినీసముదాయము వేగిరపడుచున్నది ప్రభూ !

లవణ:—తడవాగనేల ! (వెడలిపోదురు) (సభయెల్లఁ దలలువాల్చి కనుల నీరొత్తుకొనుచు దుఃఖించుచుండును.)

ఆంజ:—అరే! లవణా! బ్రదికిపోతివి గదరా శ్రీరామునికరుణచేత !

1. పౌరు:—పాపాత్ములము మాబుద్ధి పాడుబుద్ధి.

లవు:—మహారాజ! ఇంతకష్టమగు నాటకములఁ బ్రదర్శించెదరేల !

శ్రీ:—నరుఁడింత దురదృష్టవంతుఁడుగావున ! హా ! జానకీ !

సీత:—నీవు జాతిపగయే సాధింపఁదలచితివేని నీటి యందా విషమును గలుపరాదా ! దానవులయందును నొక్క దయాళుఁడు గలఁడని సంతసించియుందునే! నేను హేళనకుఁ బాత్రమైతిని గద ! కామాంధుఁడగు నాతులువయు నన్ను హేళనము సేయ సాహసింపలేదే ! అయ్యో ! నేఁడు ప్రాణనాథునిచే విడువఁబడిన దాననగుటచేఁగద ! - హారామా ! - హాజనకా !

లవణ:—అక్కటా ! ఇఁకనేఁ జూడఁజాల అమ్మా ! నేనె పశ్చాత్తప్తుఁడనై దహింపఁబడు చున్నాను.

(వెడలిపోవును.)

సీత:—ఈ మొండికట్టియువలె నీ వింకను జీవింపఁగలవా !

జన:—అమ్మా ! అట్లనేయుంటిని.

సీత:—నాగర్భము తిరుగుచున్నది. ఈనట్టడవిలో నాకెవరు దిక్కు ! అక్కటా ! నేఁడు సీత దిక్కులేనిదైనది కద!

హా రామ! (నేపథ్యమున రామ, రామ, రామ, రామ రామ, రామ, రామ, దేవ. అనిపాట.)

సీత:—హా! హా! రాక్షసులు! రాక్షసమాయ! శ్రీరామప్రభూ రక్షింపుము! దిక్కుమాలినదానను. కరుణానిధీ! ఆర్తత్రాణపరాయణ! దీనబంధూ! నిర్మల జీవితను భయాక్రాంతను - రక్షింపుము. దేవా! రక్షింపుము. (మూర్ఛిల్లును ఇందిర ప్రవేశము)

[శ్రీరాముఁడాసనముపై నిశ్చేష్టుఁడై వెనుకకుఁ బడిపోవును. సభ యంతయుఁగలకలము. శ్రీరామునకు సోదరులు, హనుమంతుఁడు కుశలవులు, తగురీతి నుపచారములు సల్పుచుందురు. శూర్పణఖ తటాలున బాణమువలె దూసికొని పోయి రంగస్థలముపై కెక్కును.]

శూర్ప:—నేను శూర్పణఖను.

విభీ:—చూచెదరేల!

ఇద్దరు ముగ్గురు రాక్షసులు:—అటులనా! నిలు! నిలు! (ముందునకుఁ గత్తులతో వత్తురు).

శూర్ప:—నిలిచియే యుంటిని. పారిపోవుటకు దేహదార్ఢ్యము కలదు. కాని హృదయదార్ఢ్యము చాలదు. కావున నిలిచియే యుందును. నన్ను మీరు చంపనేవచ్చును. అందులకు సిద్ధపడియే వచ్చితిని. కాని ఆగుఁడు. ఒక్క క్షణమాగుఁడు. నేను కొన్ని సత్యములను ముఖ్యముగ లోకమున కెఱిఁగించిన పిదపఁగాని మరణింపఁ జాలను. ఇంతకుఁ బూర్వ మెన్నఁడు నాత్మ లజ్జాకరములగు నీ విషయములను నాజిహ్వతోఁ బరులకడ నుచ్చ

రింతు ననుకొని యుండలేదు. కాని యిప్పుడెద్దియో - మున్నెన్నఁడును నాకనుభవమునందు లేని యొకక్రొత్త భావము - నా హృదయమున రేకెత్తి నూతనరసము నకు లోఁబఱచి నాకుఁ దెగువగల్పించి నాచే నిటుల నిజముఁ బల్కించివేయ సాహసముఁ గలిగించుచున్నది. (శ్రీరాముఁడు తెలివిగాంచును) ముల్లోకముల సమక్షం బున లంకాద్వీపమందు జరిగిన యగ్నిపరీక్షయందు ప్రమాణబుద్ధిఁ బుట్టించి పతివ్రతయగు సీతయెడ లోక మునకుఁ దిరిగి యనుమానము గలిగించి తన్మూలమున శ్రీరామ చంద్రునిచే సీతా పరిత్యాగము చేయింప సమకట్టి, మున్ముందు పాపమమాయికుఁడగు శంబూ కుని కడఁజేరి,వానికిఁ జేరాసలఁ గల్పించి క్షుద్రవిద్యల నుపదేశించినదానను నేన.

రామదాసు:—ఓసిరక్కసి! నీకుతంత్రమునకు ఫలముగ నా తల్లిదండ్రు లిరువురును బలియయిరిగదే. (అని యర చును).

లక్ష్మ:—వినుచుంటిరా !

శ్రీ:—లోకము వినుగాక.

శూర్ప:—మాలినియను పరిచారికను జంపి, దానివేషముఁ బూని, సీతాంతః పురముఁజొచ్చి రావణ పటమును సీత వ్రాయుచున్న దానినిగ మొదట శ్రీరామునికిఁగనఁబఱచి పిదప సీతచేయి నాపటముపైఁ గుంచెఁబెట్టులాగునఁ జేసి నదియు నేనె. లక్ష్మణుఁడు "తేరు సిద్ధముగనున్నది" యని వదినెగారినిఁ బిలుచుకొని పోవచ్చినప్పుడు సీత

"రెయింటరిగ వనములఁబో మనస్కరించుట లేద"ని బదులుచెప్ప "నీభర్త విమానముపై వచ్చి నిన్నా యరణ్యములందుఁ గలిసికొందునని నాతోఁ జెప్పి పోయె" ననిబొంకినదినేన.

శ్రీ:—దండకారణ్యావాస ప్రియసఖ !

ఒకపౌరుఁడు:—నీనాలుక యప్పుడు చీలికొనిపోలేదా !

లక్ష్మ:—ఎంత మూర్ఖుఁడనైతిని ! ఒకమారు నీముక్కు చెవులు గోసినటులనే యలనాఁడు నీ నాల్కకూడఁ గోసి యుండవలసినది. అమాయికయగు మాలినియే యను కొని నీయసత్యము నాకుణము నందెంతయో కొని యాడితిని. రాక్షసీ!

శూర్ప:—లోపాముద్ర యొసంగిన మణిహారముఁ జేత నుంచు కొని సీతను దలఁచుకొనుచు శ్రీరాముఁడు మూర్ఛిల్ల, సీత వేషంబున వచ్చి శ్రీరామునకు శీతలోపచారములఁ గావించి పిదప వాని భ్రమింపఁజేసి నాతోఁగూడ నర ణ్యములందుఁ గాపురముఁ జేయుమని వేఁడుకొనిన దానను నేన.

శ్రీ:—తమ్ముఁడా ! నీవా సమయమునకు వచ్చి నన్నుఁ గాపాడితివి !

లక్ష్మ:—నాకుఁ గోపముకంటె నాశ్చర్యము నాశ్చర్యము కంటెఁ గోపమును నెక్కువగుచున్నవి. ఏమి యాజ్ఞ !

శ్రీ:—తాళుము.

శూర్ప:—పిదప నప్సరసనై వచ్చి బ్రహ్మ మానసపుత్రినని బొంకి యశ్వమేధయాగ నిర్వహణంబునకు నన్ను ధర్మ

పత్నిగ స్వీకరించుట దేవహితమని శ్రీరామచంద్రునిఁ దరచిచూచినది నేన. అప్పుడు నిరసింపఁబడినదాన నగుట సిగ్గునుదుఃఖంబును నన్నడుగంటఁ గ్రుంగఁజేయుచుండఁ బోటునకై క్రోధము దెచ్చుకొని యొడ లెఱుఁగని యాయవస్థయందే మీ చేసెదనని ప్రతిజ్ఞఁ జేసితిని.

వసి:—వత్స ! రామచంద్ర ! నాతో నీమాట యేమియుఁ జెప్పవైతివి !

శ్రీ:—గురువర్యా! చెప్పలేదు ఎందులకని.

శూర్ప:—పిమ్మట లవణాసురుఁ డెచ్చటనుండెనాయని వెదకికొనుచుఁబోయి కుశలవుల ముందుఁ బెట్టి యశ్వమేధ మాపుచేసి తుదకయోధ్యనుగూడ నాక్రమించుకొన వచ్చునని పన్నాగముఁ బన్నినదంతయు నేన.

కుశు:—మహారాజ ! నిజము. దానవబాలుర స్నేహము మొదటఁ దెలిసికొనఁజాలకపోతిమి. తుదకు మాయమ్మ హిత మనుసరించుటచే వీరలతోఁ గలిసి తిరుగు నప ఖ్యాతినుండి రక్షింపఁబడితిమి.

లవు:—నిన్నా తాటకికడ కంపియుందునుగాని యది తప్పని తాత నుడివియుండెను.అక్కటా! స్త్రీవిగావునఁ బ్రతికిపోవుచుంటివే !

(శ్రీరాముఁడు లవుని శిరము మూర్కొని మేనునిమురును).

శూర్ప:—తుదికంతయు నిట్లయినది. దీనికంతకుఁ గారణమేమందురా! ప్రేమ! నేను శ్రీరామచంద్రునిఁ బ్రేమించితిని. అలనాఁడు మాలంకదహనమునకు, నాసోదరవధకునేమి కారణము! నాప్రేమ! ఈనాఁడు సీతా వనవా

సమును లవణాసురపరాజయమును గలిగించినదియు నా ప్రేమయె! కాదు. ఇప్పుడు తెలిసినది. "నేను శ్రీరాముని మోహించితిని. సీత ప్రేమించినది! మోహమగ్నిజ్వాల. ప్రేమ యమృతవర్షము. మోహమాత్మనాశక విషప్రాయము· ప్రేమ సర్వలోకోత్తేజక సంజీవనసదృశము. నేనంధకారమను. సీత తేజఃపుంజము. నేనోడిపోతిని. సీత గెల్చినది. శూర్పణఖ య స్తమించుచున్నది. సీత యుదయించుఁగాక ... ... దానవ వీరులార! సంసిద్ధనై యుంటిని! ... భయమొకు సహ్యాతరము, యెవ్వరు నన్నుడాసి చంపకున్నారు. ఏమి యీ నిశ్శబ్దత! నిశ్చైతన్యము! (మొలనుండి బాకు దీసికొని) ఇదియె మృత్యువు! ఓ రామ! నాకడసారి విన్నపమాలింపుము. జన్మాంతరంబున నిన్నె ప్రేమించెద. మన్నింపుము. (బాకునెత్తి పొడుచుకొనును.

(సీత తెరఁజిమ్ముకొని ప్రవేశించి శూర్పణఖ చేయిపట్టుకొని).

ఆ. ఆగుము. ఆత్మహత్యవలదు. ఘోరము పాపమంట!

లవు:—అమ్మ! అదిగో, అమ్మ! (అని ముందునకుఁబోవును.)

(శ్రీరాముఁడు కుశలవుల దగ్గరఁదీసి కౌఁగిలించుకొనుచు).

శూర్ప:—బాకు లోతుగ దిగిపోయినది. అమ్మా! నాచేయి వదలుము.

సీత:—బాకు విరిచివేయుము.

శూర్ప:—దేవి! నేనిఁక బ్రతుకను. నీకుఁ బరమ శత్రువ నైతి నిగద!

సీత:—అది నేనెఱుంగ. ఇప్పుడు నీవె నన్నుద్ధరించితివి.

శూర్ప:—సహింపఁజాల! పశ్చాత్తప్తను. హారామచంద్ర!
[అని బాకు పెరికివేసినేల వ్రాలి ప్రాణములవిడుచును. సభయంతయుఁ గల్లోలము. కుశలవులు తల్లియొద్దకుఁ బరువిడుదురు. వాల్మీకియు వసిష్ఠుఁడును రంగస్థలము పై కెక్కుదురు].

వసి:—పూజ్యులగు సభ్యుల శోకవిషయము (అంతయు నిర్బద్దము) ఈ నాటకరంగమున.

పౌరులు:—మేము పూజ్యులముగాము పాపాత్ములము. హీనులము. అల్పబుద్ధులము మమ్ము శపింపుఁడు.

వసి:—సర్వము రాక్షసమాయకద !

వాల్మీ:—అది యిప్పుడు పోయినది. సత్యోదయమయినది.

పౌరు:—సీత పరమపావని, పూజ్యురాలు. లోకమాత. సీతారాములా చంద్రార్కము సుఖముగ నుందురుగాక.

మునులు:—అదియే సర్వలోకములకు శాంతిప్రదము,శుభము.

వసి:—వత్స! రామచంద్ర !

వాల్మీ:—బిడ్డా! సీతా!

వసి:—కావున నర్థాంగిని స్వీకరింపుము.

వాల్మీ:—ప్రాణనాథునపనయించి సేదదేర్పుము.

సీత:—ప్రాణనాథుఁడు విశ్వరూపము దాల్చియుండెను.

శ్రీ:—నేఁ బుత్త్రవంతుఁడ నైతిని.

అగస్త్య:—తన్మూలమున ధర్మపత్ని తాజ్యురాలు కానేర్చునే! వానప్రస్థుఁడుగూడ భార్యాసహితుఁడై యుండవలయుఁగద !

విభీ:—మహారాజ! పరిత్యాగము ధర్మముగాదు.
ఆంజ:—ఈదాసుని మొఱాలింపుఁడు.
సామంతులు;—మహారాజ్ఞి పవిత్రురాలు.

(కౌసల్య యెదుటికివచ్చి).

అమ్మా! సీత!—తండ్రీ! రామా! ఇంకను సందియమేల!
శ్రీః—తల్లీ! నమస్కారములు.
సీత:—అత్తగారికి వందనములు. మన్నింపుఁడు.
(కౌసల్య సీతారాముల దగ్గఱకుఁదీసికొని వారిచేతులఁగల్పుచు)
క్రూరమగు విధిని మన్నింపఁదగును. నేఁడీయానందమట్టిదిగద!
వాల్మీ:—నాన్న గారికి నమస్కరింపుఁడు [కుశలవులు నమస్కరింతురు. శ్రీరాముఁడు శిరము మూర్కొని యూరకుండును. కుశలవులు కౌసల్యకుఁగూడ నమస్కరింతురు. కౌసల్య కౌఁగిలించుకొని] నారాముని మఱపించు పరాక్రమవంతులై కీర్తి నార్జింపుఁడు.
వసి:—ఇప్పుడె యట్టివారై యుండిరి.
కుశు;—తాతయ్యా! మాకడ సత్యము నింతకాలమేల దాచితివి! లేనిచో మేము నాయనగారి యాగమున కేమైనను విఘ్నముఁజేసి యుందుమే!
లవు:—కాదు. రానిత్తుమా; ముల్లోకములొక్కటిగ్గైయె త్తివచ్చినను.
ఆంజ:—నిజము సింహకిశోరము సింహకిశోరమొకద !
వసి:—వారుగో జనకమహారాజులు ! మీమాతామహులు! మహాజ్ఞానులు ! కర్మయోగులు ! లోకవంద్యులు.
లవు:—మే మిదివఱకె వారిదర్శనముఁజేసి కొనియుంటిమి.

కుశు:—కాని మాకిప్పుడు వారి మనుమలమగు భాగ్యమబ్బి యున్నదని యెఱుఁగకపోతిమి.

(కుశలవులు జనకునకు నమస్కరింతురు)

జన:—(కుశలవుల మేనులు నిమురుచు)మీకు సర్వశుభములుఁ బ్రాప్తించుఁగాక - మహాత్మ! మీరీయాఁగ "మమాం గళ్యాహారంబు, అఖిల శుభదాయకంబు" అని సంక ల్పించిననాఁడె వాక్రుక్కచ్చి యుంటిరిగద! సంకల్ప సిద్ధులు! అమోఘవాక్యులు! (హర్ష ధ్వనులు).

వసి:—ఇది తమ తపఃఫలముకాని వేఱుకాదు. మమ్మందఱ శాశ్వతాప యశమునుండి తప్పించి కాపాడెను.

శ్రీ:—క్రూర కఠోర హృదయుఁడగు రాముఁడు మామగారి పాదములకు నమస్కరించు చున్నాఁడు.

జన:—రామభద్ర! నేఁడు మనమందఱ మఁదృష్టవంతుల మైతిమి! గతముదలంపనేల! (సీతను సమీపించి) తల్లీ! ఏలవిచారించెదవు! కన్నీరు తేకుము! నేఁ జూడఁ జాలను!

సీత:—తండ్రీ! నేనేల విచారింతును! విచారముఁ దుదకు జయించితిని. ఇప్పుడానందమునకు లోనగుచుంటిని.

లక్ష్మ:—ఈ యానందమునకెల్ల నీమహాకవి సంకల్పమొకద కారణము.

శ్రీ:—నిజముఁజెప్పితివి. ఈ మహర్షికిఁ గృతజ్ఞతా పూర్వక వందనములుదక్క మఱేమీయఁగలము. ఈ ఋణ మును మనమెన్నటికినిఁ దీర్చుకొనఁజాలము.

వాల్మీ.—నేఁజేసినదేమి! ఇట్లంతయు నీసాధ్వీమణి పతిభక్తియే సమకూర్చినది.

[సభ్యులందఱును శిరమువంచి యంగీకారముఁ దెలుపుదురు.]

సీత.—నాథ! మనకొఱకై పాపమీకొూర్పణఖ ప్రాణముల విడిచెఁగదా!

శ్రీ.—మహారాజభగినికుచితమగు గౌరవముతో నీ స్త్రీయంత్య సంస్కారములు జరుగుగాక.

విభీ.—దుర్మార్గుల నంతగ గౌరవింప నక్కఱలేదనియె నా యభిప్రాయము - లవణుఁడిట రాలేదా!

ఆంజ.—వచ్చియుండెను. కాని కట్టుబట్టలు కాలిపోవుచున్న వానివలె నడుమలేచి పరుగెత్తుకొని పోయెను.

భర:—మఱేమి చేయఁగలఁడు!

శ్రీ:—మనమందఱ మయోధ్యకు మఱలుదము.

సీత:—రామదాసు - తల్లిదండ్రులు లేనివాఁడు. మన కుశలవుల యీడు. ఇందిరాతనయుఁడు ఇచ్చటికివచ్చియే యుండును.

రామదాసు.—అమ్మా! ఇక్కడనున్నాను.

శ్రీ:—నీతల్లి యెప్పుడు పోయినది.

రామదా:— నిన్ననే పతిమరణము విని సహగమనముఁ గావించి.—

సభ్యులు.—సాధు! ఇందిరా! సాధు!

శ్రీ—నీవు కూడ మావెంటరమ్ము.

రామదా.—మహాప్రభూ! నాకంటె నదృష్టవంతుఁడుగలఁడా! అయినను వాల్మీకి మహర్షి నాశ్రయించి జ్ఞాన మార్జించుకొనుమని యమ్మగారి యాజ్ఞయైనది.

శ్రీ.—మాతృవాక్యమవశ్యాచరణీయము. సర్వశుభప్రదము. అటులనే సేయుము.

సీత.—నీవు సుఖివై యుండుటయే మేము కోరునది.

శ్రీ:—దేవి! ఈయానంద ముహూర్తమున సామ్రాజ్యమందు మహోత్సవముల జరుపనాజ్ఞాపించెద.

సీత:—జీవకోటియెల్ల నానందమున నోలలాడుఁగాక.

ఋషిబృందము:—తథాస్తు.

(మంగళతూర్యములు మ్రోగును.)

(తెరపడును.)

సమాప్తము.

---

Printed at Ananda Press, Madras. 1932.

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 3 | 6 | జివమొక్క | జీవమొక్క |
| | ,, | రాజు వైద్యుల | రాజవైద్యుల |
| 7 | 2 | మేనిచ్ఛాయ | మేనిఛాయ |
| 8 | 16 | శాంతలకును | శాంతమ్మకును |
| 9 | 9 | నాతో చెప్పెనుగదా ! | నాతోఁజెప్పినఁగదా! |
| ,, | 11 | దోడ్కొన | దోడ్కొని |
| 10 | 18 | దనకథ | దమకథ |
| 11 | 4 | కాని నీయుపయశము | కాని యీయుపయశ |
| 12 | 23 | కోరకయే మున్న | కోరకమున్న [ము |
| 13 | 7 | నారబట్టలఁ దాల్చుట | జటలఁ ధాల్చుట |
| 14 | 19 | ఉత్కంఠితము ? | ఉప్పొంగుచున్నదా? |
| ,, | 20 | యగుమన్నదా ? | యగుచున్నది ! |
| 15 | 7 | యర్పితంబును. | యర్పితంబును, |
| ,, | 11 | ఈసఖి ! యెంతలో నిదుర చెందినది. | ఈసఖి యెంతలో నిదుర చెందినది! |
| ,, | 13 | సరళయీబాహు | సరమీబాహు |
| ,, | 15 | ఆసంభవము | అసంభవము |
| 32 | 17 | యానందము. | యానందము |
| 34 | 4 | యేగుతెంచు | యేగుఁదెంచు |
| 36 | 19 | మందుఱు ? | మందురు ? |
| 49 | 15 | గ్రామ్మమంలో | గ్రామంలో |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 49 | 17 | అలా చూచిలా | అలాచూచినా |
| 56 | 18 | బడిది | బడినది |
| 58 | 14 | చక్రవర్తి. | చక్రవర్తి— |
| 63 | 11 | రామచరిత్ర ! | రామచంద్ర ! |
| 64 | 16 | సౌందర్యంబును. | సౌందర్యంబును, |
| 73 | 6 | పట్టణం | పట్టం |
| ,, | 7 | తసంతోత్సవాల | వసంతోచ్ఛవాల |
| ,, | 8 | యిజయోత్సవా | యిజయోచ్ఛవా |
| ,, | 9 | మంతాయి జయ | మంతా యిజయ |
| 74 | 21 | విరీతపు | విపరీతపు |
| 80 | 2 | త్రినేత్రుని | త్రినేత్రుని |
| 83 | 9 | ప్రసాదము | ప్రసారము |
| 86 | 23 | నాకర వాలము | నా కరవాలము |
| 87 | 23 | గాత్వయము | గాత్వము |
| 89 | 4 | వెడిలిపోవును | వెడలిపోవును |
| 98 | 24 | తమ్మునితో" | తమ్మునితో" |
| 115 | 23 | దావన | దానవ |
| 124 | 14 | అనంద | ఆనంద |
| 128 | 16 | నమస్కరించును, | నమస్కరించును) |
| 129 | 21 | యంతర్థిత | యంతర్హిత |
| 160 | 8 | ముక్కుచెపులు | ముక్కుచెవులు |
| 161 | 17 | తాటకి | తాటక |
| 164 | [illegible] | కౌసల్య కౌఁగిలించు నారాముని. | కౌసల్య:—(కౌఁగిలించుకొని) నా రాముని. |

